# లిమ్కాతో అనుక్షణం సేదతీరును మరుక్షణం

లిమ్కా, ఇమ్రైకన్ నిమ్మ మరియు సిసిలియన్ నిమ్మపళ్ల వల్లని, జిల్లను రుచి, సువాసనల సంగమం బాక్టీరియా రహిత పానీయం. మీ దాహం తీర్చడానికి దీనిలో 'ఐసోటానిక్' లవణాలున్నాయి విటమిన్ సి కూడా. కాలరీలు కావాలనుకునేవారు ఇతర పానీయాలకు బదులు లిమ్కానే ఎంచుకుంటారు.

లిమ్కా మీ ఇంటిల్లిపాదినీ రంజింపజేసే అన్ని వేళలా మీ సేదతీర్చే పానీయం—ఇంటా, బయటా కూడా.



**ఈతకొట్టి సైకతాల్లో, ఇష్టంతో తాగేది లిమ్కా.**
ఈత కొట్టాక సేదతీర్చే గుటక.



**బాక్సింగ్ వీరులు మెచ్చేది, లిమ్కా వారికి వచ్చేది.**
పోటీ తర్వాత సేదతీర్చే పానీయం






**సైకిలు తొక్కే సమయం, లిమ్కా పానం రసమయం.**
షికారు తర్వాత సేదతీర్చే పానీయం.



**పిక్నిక్ సరదా కిలకిలలు, లిమ్కా నవ్వుల గలగలలు.**
బయటకు వెళ్లినప్పుడు సేదతీర్చే పానీయం.



**కెంటీన్ కబుర్ల సమయంలో, పెదులును లిమ్కా మదిలో!**
కులాసాగా కబుర్లు చెప్పుకుంటూ తాగే పానీయం.




నిమ్మ కాయ నీరులా మజా నివ్వగల పానీయం

RADEUS/PE/L-2-81







ఇటువంటి సన్నిహితమైన సన్నివేశాలలోనూ, మీకు చేరువగా ఉండేవాళ్ళు దగ్గరగా వున్నప్పుడూ మీక్కావాలి, క్లోస్-అప్—యిది టూత్ పేస్టులలోనే ఒక కొత్త పద్ధతి, ఆలోచన. దీనిలో గల అసలైన మౌత్ వాష్, మీ నోటి గాలిని క్లోస్-అప్‌లో వలె తాజాగా ఉంచుతుంది—దీనిలో గల రెండు ప్రత్యేకమైన పదార్థాలు. మీ పళ్ళను క్లోస్-అప్‌లో అంత తెల్లగా చేస్తాయి.

**క్లోస్-అప్**
**సన్నిహితులకోసం**

## లోకంపోకడ










**ఆంధ్రసచిత్రవారపత్రిక**

వ్యవస్థాపకులు :
దేశోద్ధారక కాశీనాథుని
నాగేశ్వరరావు పంతులుగారు
స్థాపితం : 1906

శివలెంక శంభుప్రసాద్
సంపాదకుడు
[1938 1972]

శుక్రవారం 23–10–'81
దుర్మతి నామ సం. ఆశ్వయుజ బ. ఏకాదశి
**సంపుటము 75 సంచిక 7**

సంపాదకుడు :
శివలెంక రాధాకృష్ణ

*

పోస్టులో ఏడాది చందా రు. 67–60
ఆరు మాసాల చందా రు. 33–80
విడిప్రతి వెల రు. 1–25 పైసలు

**ఆంధ్రపత్రిక కార్యాలయము**
గాంధీనగరం. విజయవాడ–520 003

## విషయానుక్రమణిక

ముఖచిత్రం:
"చట్టానికి కళ్ళు లేవు"లో మాధవి

**కథలు :**



**సీరియల్ కథలు :**



**వ్యాసాలు శీర్షికలు :**




కాని మీరు వదిలించుకోవాల్సింది ఓ పటాన లొంగని, తీవ్రమైన చుండు అయితే మీకు కావాల్సిన షాంపూ, క్లినిక్ ని మించినదై ఉండాలి మరి







# క్లినిక్ స్పెషల్

క్లినిక్ మీ చుండుపై పనిచేసిందని, మీకు సరిగ్గా సరిపడిందని మాకు తెలుసు అయితే ఓ పటాన లొంగని, తీవ్రమైన చుండుగల వారున్నారన్న సంగతి మాకు తెలుసు.

అందుకే ఓ పటాన లొంగని, తీవ్రమైన చుండును తొలగించేందుకు కొత్త సూత్రీకరణను ప్రవేశపెట్టాం. క్లినిక్‌ని మించినదది...దాని పేరు క్లినిక్ స్పెషల్. ఆ! ఇప్పుడు రెండు క్లినిక్ షాంపూలు ఉన్నాయి. మామూలు చుండుకు క్లినిక్...ఓ పటాన లొంగని తీవ్రమైన చుండుకు క్లినిక్ స్పెషల్ ఇక ఈ రెండింటి కలయిక చుండు సమస్యలన్నింటికీ నివారణే మరి.

హిందుస్తాన్ లివర్ లిమిటెడ్ వారి విశిష్ట ఉత్పాదన.

HLSC-5648

## ముఖచిత్రం

నటశేఖర కృష్ణ, జయప్రద ముఖచిత్రంతో వెలువడిన 25.9.81 నాటి ఆంధ్రపత్రికను చూడడానికి రెండు కళ్ళేకావుగదా వెయ్యి కళ్లున్నా చాలవనిపించింది. ఈ వారం అందించిన పుట్టిన రోజు కథ చదివాను. నన్ను ఎంతగానో ఆకర్షించింది.

కందిగట్ల ప్రభాకర్ [జనగాం]

* * *

డేరింగ్ హీరో కృష్ణ, ఆంధ్ర ప్రేక్షకుల కలల రాణి జయప్రదల ముఖచిత్రంతో వెలువడిన 25.9.81వ తేది నాటి అభిమాన పత్రిక కనకాంబ రాల గుబాళింపుతో, సౌగంధ పరిమళాలు వెదజల్లి కలర్ ప్రింటింగ్ అనన్య సామాన్యం అన్పించి, ఆకర్షించింది.

పెన్మెత్స సూరిబాబు [హైదరాబాద్]

## సీరియల్

కృష్ణ, జయప్రదల ముఖచిత్రంతో వెలువడిన ఆంధ్రపత్రిక వీక్లీ అత్యంతాకర్షణీయంగా ఉంది. పెద్ద కథ "నిధి చాలా సుఖమా?" ఇంట రెస్టింగ్‌గా ఉంది. సర్పెంగ్‌హాం సీరియల్ చాలా బాగుంది.

పి. వి. రఘునాధరావు [మధిర]

* * *

25.9.81న వెలువడిన సచిత్ర వారపత్రిక కృష్ణ, జయప్రదల ముఖచిత్రంతో ఎంతో ఆకర్ష ణీయంగా ఉన్నది. సాగర మధనం సీరియల్ చాలా ఇంటరెస్టింగ్‌గా ఉన్నది.

తిరువెంగళసుధీర్ [నందాకిష్ఠంపేట]

## కథలు

25.9.81తేది ఆంధ్ర సచిత్ర వారపత్రికలో ఆంగర వెంకట సత్యనారాయణరావుగారు వ్రాసిన



"గార్డు" కథ చాల బాగున్నది. అటు ఉపా ధ్యాయులకు యిటు విద్యార్థులకు కూడా జ్ఞానో దయం కల్గించునట్లు ఉన్నది.

అనగవరపు అలరాజు [పెన్నాడ]

* * *

25.9.81 సంచికలో 'గార్డ్' కథ చాలా మెచ్చుకొనతగ్గది. ప్రతి ఉపాధ్యాయుడు మరియు లెక్చరర్ 'దీక్షితులు' వలె ప్రవర్తిస్తే ఈనాటి విద్యార్థులు ఎంతో ముందుకు వస్తారు.

పి. అనంతరావు. [గుంటూ]

* * *

25.9.81 వారపత్రికలో 'గార్డు' అను కథ చాలా ఉత్తమముగా ఉన్నది. కథ చదివినంత సేపు నాకు కన్నీళ్లు ఆగలేదు.

ఎన్. పి. బాబు [కాకినాడ]

* * *

25.9.81 నాటి ఆంధ్ర సచిత్ర వారపత్రిక లోని కథలన్నింటిలోను గార్డు అనే కథ చాలా బాగుంది. రచయితకు నా ధన్యవాదాలు.

సి.హెచ్. గోవిందరావు [అమలాపురం]

* * *

ఆంధ్ర సచిత్ర వారపత్రిక ముఖచిత్రం కృష్ణ, జయప్రద చాల బాగుంది. గార్డు కథ చాల బాగుంది.

కె. రమణమ్మ, ఆర్. విజయలక్ష్మి [కడనూతల]



వర్షాలవల్ల బస్సుల రాకపోకలకు అంతరాయం కల్గి 25.9.81 తేది పత్రిక చాల ఆలస్యంగా చేరింది. ఆలస్యమయినందుకు తిట్టుకుంటూనే పత్రిక చదివిన మాకు ముఖ్యంగా 'గార్డు' కథ చదివి అప్పటివరకు మేం పడిన చికాకంతా మరిచి పోయాము. రచయిత ఒక వైపు విద్యార్థులకు మరో వైపు అధ్యాపకులకు ఎంత సున్నితంగా సందేశమిచ్చారంటే అది ఆ కథచదివితేనే అర్థం అవుతుంది. రచయితగారికి మా ధన్యవాదాలు.

పి. సబిత [కుప్పం]

* * *

ముఖచిత్రం నా అభిమాన కృష్ణ—జయప్రద లతో వెలువడి నా మనసుని ఆనంద డోలికలలో ముంచివేసినది. ఈ సంచికలో పుట్టిన రోజు కథ నాకు నచ్చింది. సహజంగా ఉంది.

యేలె బాలరాజు [జనగాం]

* * *

25.9.81 వ తేది కృష్ణ, జయప్రద ముఖ చిత్రంతో వెలువడిన ఆంధ్ర సచిత్ర వార పత్రికలో ప్రచురింపబడిన పుట్టిన రోజు కథ చాల బాగుంది. నిధి చాల సుఖమా అను పెద్ద కథ చాల బాగుంది. చాల చక్కగా చివరకు ముగిసింది. కె. రామలక్ష్మిగారి ప్రశ్నావళి కూడ బాగానే ఉంది.

వెంకురమహంతి మన్మథ పట్నాయక్ (బరంపురం)

* * *

25.9.81 నాటి ఆంధ్ర సచిత్ర వారపత్రిక కలో కథలన్నింటిలోను పుట్టిన రోజు కథ చాల బాగుంది.

ఎం. క్రిష్ణకిశోర్ [హైదరాబాదు]

* * *

25—9—81 సంచికలో "గార్డు" కథ చాలా చక్కగా వుంది. ఎంతటి కోపిష్టినైనా మంచి మాటలలో మనిషిని తన వానినిగా చేసుకో వచ్చు. రచయితగారు రచన చాలా చక్కగాచేసారు.

ఎన్. కృష్ణారావు (మంగళగిరి)

* * *

ఆంధ్రసచిత్ర వారపత్రిక 4—9—81 సంచికలో ఆదర్శం, నాణేనికి మరోవైపు చదవాలనిపించాయి.

గుంటమడుగు సుబ్బారామరాజు, సుహాసిని, కమల, గోపి, కృష్ణ, జియుస్సార్ రాజు, రమాదేవి, లక్ష్మి కుమారి, ఎస్. వెంకటేష్ [గూడూరు]

## వంటలు

ఆంధ్ర సచిత్ర వారపత్రికలో వంటలు శీర్షి కలో ప్రచురించిన మాదిరెడ్డి లక్ష్మిగారి మరాటీ ఖీర్ ని మా ఇంట్లో చేయించాము, చాలా బాగుం దని వ్రాయడానికి సంతోషిస్తున్నాను. చక్కటి వంటకం ప్రచురించిన మీరు ఎంతైనా అభినంద నీయులు.

పాకనాటి జగదీశ్ కుమార్ [మధ్యప్రదేశ్]

సీరియల్

# సాగర మథనం

మూరెళ్ళ ఉమాదేవి



(గత సంచిక తరువాయి)

దైవ దర్శనం చేసుకుని రూ.కిపస్తుంటే సరళాదేవి కనిపించింది రెండేళ్ల బాబు నెత్తుకుని ఆ సమయంలో సరళాదేవి కనిపించడం తన అదృష్టంగా భావించాడు రవి

"సరళాదేవీ" అని కాస్త బిగ్గరగా పిలిచాడు

ఉలిక్కిపడి వెనుదిరిగి చూసింది సరళ "ఓహో! మీరా!" అంది నవ్వుతూ,

"ఏమిటిలా వచ్చారు?" అన్నాడు రవి.

"ఇక్కడికి దేనికి వస్తారు?" ఎదురు ప్రశ్న వేసింది సరళ

"నా ప్రశ్న నాకే వేశారూ? సరే ఇంతకీ ఏమైనా విశేషం వుందా? ఈ బాబెవరు?"

"చిన్న విశేషమే అనుకోండి నేను రికెన్‌లో సెలక్టయ్యాను. ఇంటర్వ్యూకి ఢిల్లీ వెళ్తున్నాను."

"చిన్నదంటారేమిటి? పెద్ద విశేషమే! హార్దిక కంగ్రాట్యులేషన్స్" అన్నాడు సంతోషంగా

"క్రెడిట్ కొంత మీకూ దక్కుతుంది మీ ప్రోత్సాహమూ, సహాయమూ లేకుండా పాసయ్యేదాన్ని కాదు."

"ఈ బాబెవరు?" ఆమె పక్కగా నడుస్తూ, అడిగాడు.

"నా బాబు."

ఉలికిపడ్డాడు రవి "సరళాదేవి! మీకు... మీకు..." ఆమెకు వివాహమైందంటే నమ్మశక్యం లేదు రవికి.

"అప్పుడు రవీ అన్ని ముచ్చట్లూ తీరిపోయాయ్ నాకు" ఆమె గొంతులో విపరీతమైన వ్యథ కూడుకుని వుందని గ్రహించక పోలేదు రవి.

"సరళాదేవీ, మీరు బాధ పడుతున్నారు నాకున్న కొద్దిమంది మిత్రులలో మీరొకరు మీరలా బాధ పడుతూంటే నాకు కష్టంగా వుంది అసలు ఏం జరిగిందో చెప్పరా?"

"పదండి అలా తోటలో కూర్చుందాం" అంటూ పూల తోట లోనికి దారి తీసింది చీకటి పడుతోంది. గార్డెన్ చివర అమర్చిన శంఖం, చంకం రంగు రంగుల లైటలో అందంగా కనిపిస్తున్నాయి.

బాబు కొంచెం దూరంలో ఆడుకుంటున్నాడు. రవి ఆమె ఏం చెపుతుందోనని ఆతృతగా ఎదురు చూస్తున్నాడు.

గడ్డి మొక్కనేదో చిదుముతూ ఆమె చెప్పసాగింది —

"నేను బి. ఏ ఫైనలియర్‌లో వుండగానే వివాహం బావతో జరిగింది. తను ఇండియన్ ఎయిర్ ఫోర్స్‌లో 'ఫ్లయింగ్ ఆఫీసరు'గా వుండేవాడు 'ఎప్పుడూ గాలిలో తిరుగుతూ వుంటాడు. మా అమ్మాయి నివ్వను' అని నాన్న మొండికేసినా వినకుండా మా పెళ్ళికి ఒప్పించాను అయిష్టంగా ఒప్పుకున్నారు నాన్న. నేను కన్న కలలు నిజమయ్యాయని మురిసిపోయాను బావతో వివాహం పెద్ద అట్టహాసంగా జరిగింది. బావ రెండు నెలల సెలవులూ రెండు రోజుల్లో గడిచిపోయానిపించింది 'వెళ్ళగానే క్వార్టర్‌కి అప్లయి చేస్తాను. క్వార్టర్స్ దొరకగానే తీసుకెళ్ళిపోతాన'ని చెప్పి బావ వెళ్ళిపోయాడు.

మా ఒప్పందం ప్రకారం రెండు రోజులకో వుత్తరం చొప్పున రాసుకునే వాళ్ళం. నా రిజల్ట్స్ వచ్చాయి. ఫస్ట్‌క్లాసులో పాసయ్యాను యం. ఎ ఫస్ట్ క్లాస్ రావడం అంత తేలిక కాదు నాకెంతో సంతోషంగా వుంది అంటూ మురిసిపోతూ రాశాడు బావ. కొద్ది రోజుల తర్వాత మరో శుభవార్త కూడా రాయవలసి వచ్చింది బావకి— అదే తను తండ్రి కాబోతున్నాడని 'ఏమిటోయ్ ఈ శుభవార్తలపరంపర. వుక్కిరి బిక్కిరి చేస్తున్నావ్' అంటూ

# సాగర మథనం

రెండు టావుల వుత్తరం రాశాడు. అదే బావ రాసిన చివరి ఉత్తరం.

అంతలోనే వచ్చాయ్ పాకిస్తాన్‌తో యుద్ధం బంగ్లాదేశ్ అవతరణ. ఆ యుద్ధం ఇండియాకెంతో ప్రతిష్ఠ తెచ్చిపెట్టింది. దేశ ప్రజ అందరూ ఆనందంతో హర్షం వెలిబుచ్చారు. కాని మామూలు ప్రజలెందరికి తెలుసు మా బావలాంటి వాళ్ళెంతమందో ఆ మారణ హోమంలో సమిధలై పోయారని?' దోసిట్లో ముఖం దాచుకుని ఏడుస్తోంది సరళ.

ఆమెనెలా ఓదార్చాలో తెలియలేదు రవికి. ఎప్పుడూ కిలకిల నవ్వుతూ తిరిగే సరళలో అంత బడబానలం దాగి వుందంటే నమ్మలేకుండా వున్నాడు రవి. గతించిన చరిత్రని తిరగేసి ఆమెను బాధ పెట్టినందుకు నొచ్చుకుంటూ అన్నాడు— "క్షమించండి సరళా. మిమ్మల్ని అనవసరంగా బాధ పెట్టాను."

ఆమె కళ్ళు తుడుచుకుని అంది— "ఫర్వాలేదు రవీ. బావని ఏదో వేళలో తలచుకుని రోజూ కొంత కన్నీరు కార్చడం అలవాటయిపోయింది. బావ పోయిన తర్వాత బాబు పుట్టాడు. తండ్రిని చంపి పుట్టాడని అందరూ వీడిని హేళన చేసేవారు. ఉద్యోగానికి ఎప్లయి చేశాను. మన కాలేజీలో పోస్టింగ్ వచ్చింది. బాబుకి మరో రెండు సంవత్సరాలు వచ్చేవరకూ వాళ్ళ దగ్గరే వుంచుకుంటామన్నారు అమ్మా నాన్నా బాబుని అమ్మా వాళ్ళ దగ్గర వదిలి విశాఖ వచ్చాను."

"ఇన్ని అగ్ని పర్వతాలు దాగివున్నా యేమాత్రం చలించకుండా నలుగురిలో సరదాగా తిరగ గలుగుతున్నారంటే మీకు చేతులెత్తి నమస్కరించాలనిపిస్తోంది."

"నన్నేదో ఊహకందని వ్యక్తిని చేసేయకండి. అంతటి ఔన్నత్యం నాలో లేదు. బాబు కోసం బ్రతకాలి. బావ స్మృతులనుండి దూరమవ్వాలంటే ఏదో పని వుండాలి. తీరికలేని పనైతే మరీ మంచిది బావ అనేవాడు— 'కళ్ళనిండా కాటుకా, దోసగింజ బొట్టూ నీకెంతో యింపుగా వుంటాయి. నా కోసం నువ్వు ఎప్పుడూ అలాగే కనబడాలి' అని. ఆ నాటి బావ కోరిక యిప్పుడు నాకెంతో మేలు చేస్తోంది. కనిపించిన ప్రతివారికీ నా చరిత్ర చెప్పనక్కరలేక పోతోంది."

చీకటి దట్టంగా ముసిరింది. అన్నిహోట్లా

**జరిగిన కథ – 7 :** ఓ కాలేజీలో లెక్చరర్‌గా పని చేస్తుంటాడు రవీంద్ర. తన స్టూడెంట్ కవిత ఇంట్లో ఓ పోర్షను అద్దెకు తీసుకొంటాడు. మిత్రుడు శంకరంతో కలసి సినిమాకి వెళ్లిన అతనికి ఆ హాల్లో ఎకనమిక్స్ లెక్చరర్ గోపీనాథ్ ప్రక్కన కూర్చున్న యువతిని ఎక్కడో చూసినట్లు జ్ఞాపకం. లోగడ తను పెళ్లి చూపుల్లో చూసిన సుధే ఆ యువతి అని రవీంద్రకు గుర్తు వస్తుంది. రవీంద్ర పట్ల సుధ తన అయిష్టతను చూపుతుంటుంది. సుధను లోబరుచుకొని తనవెంట తిప్పుతున్న గోపీనాథ్ దుర్మార్గుడని సరళాదేవి ద్వారా తెలుసుకున్న రవి, ఆమెను కాపాడే విధానాలను గురించి ఆలోచిస్తుంటాడు. ఓ రోజు 'గోపీనాథ్ మంచివాడు కాదు' అని సుధతో చెప్పి ఆమెచే చీవాట్లు తింటాడు రవి. 'బర్త్‌డే'ని నమ్మి యింటికి వచ్చిన సుధను గోపీనాథ్ చెఱచ ప్రయత్నిస్తుండగా రవి రక్షిస్తాడు. అతనికి తన మనసులో చోటిస్తుంది సుధ. రవితో కవిత పెళ్లి చేయాలని నిశ్చయించుకొంటుంది బామ్మగారు. కవిత కూడా రవికి తన మనసులో చోటిస్తుంది. పరీక్షలైపోయిన తర్వాత సుధ, కవిత, రవి, శంకరం, సుగుణ పిక్నిక్ ప్రోగ్రాం అరకావల్లి వెళ్లిచూసి తిరిగి వీరి స్థానాలకు వారు చేరుకొంటారు. రవీంద్రతో కవిత పెళ్లి జరుగుతుందని సుగుణ ద్వారా తెలుసుకొన్న సుధ లోన బాధపడినా పైకి తన సంతోషాన్ని తెల్పుతుంది. కవిత తండ్రి రామారావ్ రవి వాళ్లింటికి వచ్చి పెళ్లి ఖాయం చేసుకొని వెడతాడు. రవికి పెళ్లి ఇష్టంలేక, అక్కడ వుండలేక తిరుపతి వెళతాడు.

లైట్లు వెలిగాయ్ "మీరింకా ఎన్నాళ్లుంటారిక్కడ?" అన్నాడు రవి మాట మారుస్తూ.

"రెండు రోజు లుంటాము."

"కూడా ఎవరైనా వచ్చారా ?"

"అమ్మా నాన్నా వచ్చారు. పదండి యిక వెళ్దాం" అంటూ లేచింది.

" పదండి " అంటూ లేచాడు రవి భారమైన మనసుతో. బాబు నెత్తుకుని ఆమెతో కాటేజ్ వరకు నడిచాడు.

"రేపు ఎక్కడ కలుస్తారు ?" అతను వెళ్లిపోతుంటే అంది సరళ వెనక నుండి.

రవి ఆగి వెనక్కి తిరిగాడు "ఉదయాన్నే యిక్కడకి వచ్చేయండి" అంది సరళ.

'అలాగే' నని తలూపి రూం చేరుకున్నాడు.

ఆ రాత్రి అతనికి నిద్ర పట్టలేదు సరళ చరిత్ర విన్న తర్వాత తన చిక్కులన్నీ అతి సామాన్యమైనవిగా తోచాయి. బెడ్ మీద యిటూ అటూ దొర్లుతూ గడిపాడు. ఎప్పుడు నిద్ర పట్టిందో తెలియదు. ఉదయం ఐదు గంటలకి లేచాడు కోవెల్లోంచి భక్తిగీతాలు శ్రావ్యంగా వినవస్తున్నాయి. స్నానం ముగించి సరళాదేవిని కలుసుకోవటానికి బయలుదేరాడు.

రవిని పరిచయం చేసింది సరళ వాళ్ళ అమ్మా నాన్నకి. కాఫీ తెప్పించుకుని వాళ్ల నలుగురూ తాగేరు. బాబుని తీసుకుని మళ్లా దైవదర్శనానికి వెళ్తామన్నారు సరళ అమ్మా నాన్నా.

"మీరు సరాసరి కాటేజ్‌కి వచ్చేయండి దర్శనం అయిన తర్వాత, నేను రవి గారితో కలిసి పాప వినాశం చూసి వస్తాను" అంది సరళ.

"ఆటోలో వెళ్దామా? నడిచివెళ్దామా?" అడిగాడు రవి మెట్లు దిగుతూ.

"నడిచే వెళ్దాం" అంది సరళ. ఆ రోజు ప్రసన్నంగా కనిపించింది సరళ రవికి. 'నిన్నటి సరళేనా యీమె ?' అనుకున్నాడు ఆశ్చర్యపోతూ.

సరళ ఉల్లాసంగా ఏవేవో మాట్లాడుతూ నడుస్తోంది.

"సరళాదేవీ, నేను కొన్ని చిక్కుల్లో పడ్డాను. నన్నుకొంచెం తగిన సలహా యిస్తారా ?" అన్నాడు రవి మొహమాటంగా.

"అమ్మో ! మీరు చిక్కుల్లో పడడమేమిటి ? వాటిని నేను పరిష్కరించడమేమిటి ? యిదేదో ఏయిత్ వండర్ లా వుంది ! చెప్పండి" అంది తమాషాగా నవ్వుతూ.

సుధతో పరిచయం మొదలుకుని, ఆమెపై తనెటువంటి ఆశలు పెంచుకున్నాడో—అంతా వివరంగా చెప్పాడు రవి.

అతను చెప్పిందంతా విని ఉదాసీనంగా అంది సరళ—"పాపం, కవిత పరిస్థితి తలుచుకుంటే జాలి కలుగుతోంది."

"నిజమే ననుకోండి. కాని కేవలం జాలిపడి మాత్రం ఆమె పెళ్ళా చేసుకునేది?"

"సుధ మాత్రం మిమ్మల్ని ప్రేమిస్తోందని ఎలా అనుకుంటున్నారు ? గోపీనాథ్ బారి నుండి రక్షించారని మీపై అభిమానంగా ప్రవర్తించవచ్చు కదా ! అది కేవలం కృతజ్ఞతా భావమే అయి వుండవచ్చు."

"కావచ్చు. కాని సుధకి తప్ప యింకెవరికీ నా హృదయంలో స్థానం కల్పించలేను. ఆమె అంగీకరిస్తే వివాహం చేసుకుంటాను. లేకపోతే యిలాగే వుండిపోతాను. ఏవి మాటలాగులని నవ్వుకోకండి. రెండు సంవత్సరాల క్రితం తీసుకున్న నిర్ణయమిది ! దానిలో మార్పు వుండదు" అన్నాడు రవి ఉద్వేగంగా.

"మీ పట్టుదల హర్షించ దగ్గదే ! కాని కవితకు మీరు అన్యాయం చేస్తున్నారని పిస్తోంది" అంది సరళ నిట్టూరుస్తూ.

దోషిలా తల వంచుకున్నాడు రవి.

సుధా, కవితా— యిద్దరూ కళ్లల్లో మెదిలారు సరళకి. ఎప్పుడు కనిపించినా యిద్దరూ





## సాగర మథనం

కలిసే కనిపించేవారు. ఎటువంటి చిక్కుల్లో పడ్డారు! నిశ్శబ్దాన్ని భంగ పరుస్తూ అంది సరళ —

"చూడండి రవీ, యిప్పటికే మీరు చాలా ఆలస్యం చేసారు. మీరు సుధని అంత గాఢంగా ప్రేమిస్తూ వుంటే వెంటనే వెళ్ళి ఆమెను కలుసుకుని మీ మనసులోని మాట ఆమెతో చెప్పండి. కవిత ఎదురుగా నిలిచి చెప్పలేకపోయినా ఆమెకు వెంటనే ఉత్తరం రాయండి. నిండు కుండ లాంటి మనిషి ఆమె. మొదట కాస్త బాధ పడినా తమా యించుకునే శక్తి ఆమెలో వుందనుకుంటాను. మీరు చేసుకోబోయేది తన ప్రియ మిత్రురాలినే కనుక నిండు మనసుతో మీ వివాహం ఆకాంక్షించవచ్చు. అసలు మీ లాంటి వారికి వారు ప్రేమించకూడదు రవీ."

చిన్న పిల్లవాణ్ణి మందలించినట్లుగా వున్నాయి ఆమె మాటలు. వయసులో చిన్నదైనా సరళ ఒక మహోన్నత వ్యక్తిలా కనిపించింది రవికి.

"క్షమించండి రవీ, సాటి స్త్రీకి అన్యాయం జరుగుతోందన్న బాధతో ఏమేమో అన్నాను. మీ కన్నా చిన్నదాన్ని, మీరు పొరబాటుగా భావిస్తే మన్నించండి" అంది సరళ వొచ్చు అంటూ.

"లేదు సరళాదేవీ, మీరు పలికే ప్రతీ మాట ఎంతో విలువైనది. మీకెలా కృతజ్ఞత చెప్పాలో తెలియడంలేదు" అన్నాడు రవి.

అతనొక దృఢ నిశ్చయానికి కొచ్చాడు.

ఆ రాత్రికే సరళా వాళ్ళు మద్రాసు వెళ్ళిపోయారు. అక్కడ నుండి ఢిల్లీ వెళ్ళిపోతానంది. సరళ తిరిగి వచ్చాక ఉత్తరం రాస్తానని అతని అడ్రసు తీసుకుంది. తను బాబు దగ్గర గుంటూరులోనే వుంటానంది. సరళా వాళ్ళకి వీడ్కోలు చెప్పి విశాఖ బయలు దేరాడు రవి.

* * *

"అప్పుడే సెలవులయిపోయా యేమిటోయ్?" అన్నాడు శంకరం రవి రిక్షాలోంచి దిగుతూంటే.

"సెలవల్లో రాకూడదా ఏమిటి?" అన్నాడు రవి శంకరం వెనకవే లోపలికి వడుస్తూ.

"అబ్బే నా ఉద్దేశం అది కాదు. హటాత్తుగా యిలా వూడిపడ్డావేమిటని? అంతా బాగున్నారా?"

లోపల పనిలో వున్న సుగుణ రవి మాటలు విని హాల్లోకి వచ్చింది. రవిని పలకరించి మంచి నీళ్ళు గ్లాసుతో తెచ్చి యిచ్చింది.

"సుగుణా, వీడిలా హటాత్తుగా రావడాని కొక్కటే కారణముంది" అన్నాడు శంకరం నవ్వుతూ.

"అబ్బ! మీ రూరుకోండి. అతనిలా వచ్చాడో లేదో మీ ఉపన్యాసం మొదలెట్టారు" అంది సుగుణ భర్తపై కోపం పడుతూ.

"వుండవోయ్. మనది షెర్లాక్ హోమ్స్ బ్రెయిన్! ఆవులిస్తే పేగులు లెక్కపెట్ట గలను. వీడు వారం తిరక్కుండా వచ్చేసా డంటే ఏదో కారణ ముండక పోదు" అన్నాడు శంకరం సిగరెట్ వెలిగించుకుంటూ.

"పోనీ చెప్పకో చూద్దాం" అన్నాడు రవి బట్టలు విప్పుకుంటూ.

"వీడికో చండ శాసనుడు లాంటి మామయ్య వున్నాడు, వీడు సెలవల్లో యిల్లు చేరగానే ఠక్కున మెడ పట్టుకుని ఏదో పిల్లనిచ్చి పెళ్ళి చేస్తానని వుంటాడు. వీడు గిల గిలా కొట్టుకుని ఎలాగో కష్టంగా బయటపడి యిలా వచ్చేసాడు."

అతని మాటలకి సుగుణకి కూడా నవ్వు వచ్చింది.

"నువ్వు చెప్పింది పూర్తిగా కాకపోయినా కొంత కరెక్ట్! కాని నేను వచ్చింది వేరే పని మీద" అన్నాడు రవి.

"చూసావా సుగుణా, వాడి షెర్లాక్ హోమ్స్ బుర్రంటే కాదంటావ్ మరి! నా

## గుడ్డివారి కోసం విజ్ఞాన సర్వస్వం

ఇస్తోనియా విజ్ఞాన శాస్త్ర పరిషత్తుకు అనుబంధితమయిన భాషా, సాహిత్య సంస్థలోని కంప్యూటర్ భాషా శాస్త్ర ప్రయోగ శాల మాట్లాడే విజ్ఞాన సర్వస్వాన్ని తయారించింది. ఇందువల్ల యీ రిఫరెన్సు గ్రంథాలలోని అంశాలను గుడ్డివారు కూడా యథేచ్ఛగా వినియోగించుకోవచ్చు. విజ్ఞాన సర్వస్వపు విభిన్న సంపుటాలను కంప్యూటరుకు అందించి, దాని ద్వారా ధ్వని ముద్రిత మొనర్చడం జరిగింది. అదిప్పుడు క్యాసెట్ల రూపంలో మార్కెట్లో లభ్యమవుతుంది.

# రెక్సోనా మీ చర్మాన్ని సంరక్షిస్తుంది...





## మృదువుగా మెరిసేలా ఉంచుతుంది

రెక్సోనాలో ఉంది సహజసిద్ధమైన
నాలుగు నూనెల సమ్మేళనం—

హపుషా (దేవదారు జాతి),
లవంగ పట్ట, లవంగ, నరళం.
రెక్సోనాతో స్నానం చెయ్యండి—
అది మీ చర్మాన్ని మృదువుగా
మెరిసేలా ఉంచుతుంది. మీరెంతో
ఇష్టపడే పరిమళాన్ని చర్మంపై
నిలిపి గుబాళింపజేసే రెక్సోనా
మీ చర్మ సంరక్షణకోస
సహజమైన సాధనం.




# రెక్సోనా మీ చర్మ సౌందర్యం కోసం

హిందుస్థాన్ లివర్ వారి విశిష్ట ఉత్పత్తి

లింటాస్—RX. 78-2315 TL

"మెచ్చాం లెండి మీ బుర్రవి. అయినా రవికేం ఖర్మ పట్టిందని బలవంతంగా పెళ్ళి చేసుకోవడం? అతని కిష్టమైన పిల్లనే చేసుకుంటాడు." అని లోనికి వెళ్ళింది సుగుణ.

# సాగరమథనం

సాయంత్రం నాలుగైంది.

రవి స్నానంచేసివచ్చి తల దువ్వుకుంటూండగా అన్నాడు శంకరం— "సాయంత్రంవేళ యింత ట్రిమ్‌గా తయారై వెళ్తున్నాడంటే ఏదో పిల్ల చూపులకే లాగుంది. నన్ను కూడా తీసుకుని వెళ్ళవోయ్."

"కాశీకి వెళ్తూ పిల్లిని చంకలో పెట్టుకుని వెళ్ళాడుట వివరో." వెటకారంగా అని

రవికి కాఫీ తెచ్చి యిచ్చింది సుగుణ.

'అక్కయ్యగారూ, వీడి నోరు కాస్త మూసి వుంచండి నేను బయట పడేవరకూ. వీడి డిటెక్షన్‌తో చంపుతున్నాడు'' అన్నాడు రవి కాఫీ చప్పరిస్తూ.

''అమ్మో అంతపని చెయ్యకోయ్'' అన్నాడు శంకరం నవ్వుతూ.

కాఫీ తాగేసి రవి వెళ్ళిపోతూంటే అన్నాడు శంకరం వెనుకనుండి– 'త్వరగా వచ్చేయ్. నీ కోసం వెయిట్ చేస్తూంటాం''

సాయంత్రం నాలుగున్నర అయినా చైత్ర మాసపు ఎండ చురుక్కు మంటోంది. కొంత దూరం నడిచి ఆటో ఎక్కాడు రవి. సుధా వాళ్ళ ఇల్లు చేరేసరికి మరో పావుగంటయింది.

గేటు తెరుస్తూండగా అతని చేతులు వణికాయ్. తను ఎంతో కాలంనుండి మనసులో దాచుకున్నది వ్యక్తం చెయ్యబోతున్నాడు. ఎటువంటి పరిణామాలు ఎదుర్కోవలసి వస్తుందో!

గేట్ చప్పుడికి తలెత్తి చూసింది సుధ. ఏపుగా ఎదిగిన అశోక వృక్షాల నీడలో గార్డెన్ ఛెయిర్‌లో కూర్చుని ఏదో చదువుకుంటోంది. రవిని చూడగానే ఆశ్చర్యం, ఆనందం– ఒక్కసారే కలిగాయ్.

గేట్ మూసి యింటివైపు నడుస్తున్న రవి ''మాష్టారూ'' అన్న పిలుపుతో ఆగిపోయాడు. పుస్తకం చేత్తో పట్టుకుని అతని దగ్గరికి వచ్చింది సుధ పరుగులాంటి నడకతో. కొద్దిగా చిక్కినట్టు కనిపించింది రవికి.

''రండి లోపలికి''అంటూ అతని ముందు నడిచింది.

తల్లికి పరిచయం చేసింది రవిని.

''నమస్కారమండీ'' అన్నాడు రవి.

ప్రతి నమస్కారం చేసి ఆవిడ లోపలికెళ్ళిపోయింది. ఆ హాలుసంతా పరికించి చూసాడు రవి. సుధతో తొలి పరిచయం అక్కడే జరిగింది.

''ఏమిటలా చూస్తున్నారు?'' అది సుధ. ఆమె అతని కెదురుగా సోఫాలో కూర్చుంది.

''ఇక్కడే కదా మిమ్మల్ని మొట్టమొదటి సారిగా చూసాను'' అన్నాడు రవి ఆమె ముఖ కవళికలు పరిశీలించడానికి ప్రయత్నించేస్తూ.

''ఇన్విటేషన్స్ తెచ్చారా?'' అంది సుధ అతని మాట దాటేస్తూ.

''ఏ యిన్విటేషన్లు?'' అన్నాడు రవి ఆశ్చర్యంగా.

కౌసల్య డ్రింక్స్ తెచ్చి యిచ్చింది. ఆమె వెళ్ళిపోయాక అంది సుధ– ''కవి ఉత్తరం రాసింది.''

''ఏమని?''

''మీకు తెలిసినవే లెండి.''

''ప్లీజ్, అలా బయటికెళ్దాం వస్తారా?''

సుధ అతనివైపోసారి వింతగా చూసి ''యిప్పుడే వస్తా నుండండి'' అని లోనికి వెళ్ళింది.

ఆమె డ్రెస్ మార్చుకుని వచ్చేసరికి,రవిలేచి నిలబడ్డాడు

''ఎక్కడి కెళ్దాం?'' అంది సుధ గేటు దాటిన తర్వాత.

''ఎండ చల్లబడింది. బీచ్ కెళ్దాం'' అన్నాడు రవి

సుధ కంతా అయోమయంగా వుంది. రవి మీద పెంచుకుంటూ వచ్చిన ఆశలు కవిత ఉత్తరంతో పూర్తిగా చచ్చిపోయాయ్. రవిని చూడగానే పరవశించి పోతోంది మనసు. 'రవి మిమ్మల్ని విడిచి వుండలేను'– ఆ మాట ఎన్నోసార్లు అనుకునేది యిది వరకు. తిరిగి అదే మననం చేసుకుంటోంది మనసు.

'సుధతో వాళ్ళ యింటిలోనే చెప్పేయ వలసింది. బీచ్‌కి తీసుకొచ్చి చెప్పడం మరీ తెలుగు సినిమా ఫక్కీలా వుంటుందేమో! ఇంతకీ ఏమని చెప్పడం? అంత సరళగా ఏదో చెప్పాలనుకున్నాడు. తీరా ఆమెని చూసాక ఏమీ చెప్పలేక పోతున్నాడు. ఛ! సరళ చెప్పినట్టుగా తనలాంటి వారికి వాళ్ళు ప్రేమించడానికి అర్హులు కారు.'

ఆలోచనల్లో వున్న యిద్దరూ ఆటో బీచ్ చేరడంతో వాస్తవంలోకి వచ్చారు.

బీచ్‌లో జనం పలుచగా వున్నారు. ఇసుక యింకా వేడిగా వుంది. సరుగుడు చెట్లనీడలో కూర్చున్నారు కొంత దూరం నడిచాక.

కొంతసేపు మౌనంగా వున్న తర్వాత అంది సుధ– ''ఏదో చెప్తానని యింత దూరం తీసుకొచ్చి మౌనంగా వుండిపోయారు?!''

ఏమని ప్రారంభించాలో తోచక ''కవిత ఏమని రాసింది?'' అన్నాడు.

''మీతో మేరేజ్ ఫిక్స్ అయిందని.''

''కాని నేనామెను కోరడం లేదు సుధా.'' అన్నాడు గంభీరంగా.

''మరి?'' ఆశ్చర్యంతో కళ్ళు పెద్దవి చేస్తూ అడిగింది సుధ.

''చిత్రమైన పరిస్థితిలో యిరుక్కున్నాను సుధా! నేనొకర్ని ప్రేమిస్తే నన్నింకొకరు కోరుతున్నారు.''

''మీ రెవర్నయినా ప్రేమిస్తున్నారా?'' మాటేనా అడిగింది సుధ.



# సాగరమథనం

"ప్రేమిస్తున్న వ్యక్తే ఎదుట నిలిచి అడుగుతూ వుంటే ఏమని సమాధానం చెప్పాలో తోచడం లేదు."

"రవీ!" ఆనందాతిశయాలు వెల్లివిరియగా సంబరంగా అంది సుధ.

"అవును సుధా. మొదట నిన్ను చూసిన దగ్గర నుండీ మవ్వే నాలో గూడు కట్టుకుని నిలిచావ్. నువ్వు ఎంత హేళనగా ప్రవర్తించినా నిన్నే మనసులో నింపుకున్నాను. ఇప్పుడు నా హృదయంలో కవిత కెట్లా స్థానం కల్పించ గలను?" ఉద్వేగంగా అన్నాడు రవి.

"రవీ, యిది కలో నిజమో అర్థంకావటం లేదు."

"ఇన్నాళ్లూ కలల్లోనే గడిపాను యిక నుండైనా వాస్తవంలో బ్రతుకుదాం సుధా" ఆమె రెండు చేతులనీ లందుకుని అన్నాడు రవి.

"రవీ" అంటూ అతనిమీద వాలిపోయింది సుధ పరిసరాల్ని మరచి ఆమెలో దుఃఖం, సంతోషం– ఒక్కసారిగా పెల్లుబికాయ్.

"మిమ్మల్ని పోగొట్టుకున్నానని ఎంతగానో కుమిలిపోయాను" అంది అతని భుజం మీద తల పెట్టుకుని

"ఛ! ఏడుస్తున్నావా ?" అన్నాడు రవి ఆమె కంటి నీరు తుడుస్తూ

"కానీ రవి, కవి మిమ్మల్ని ఎంతగానో ప్రేమిస్తోంది" అంది సుధ ఏదో గుర్తుకొచ్చి నట్టుగా.

"అదే దురదృష్టకరం సుధా ఆమెనాపై ఆశలు పెంచుకోడానికి నాకు తెలియకుండా నేనే దోహదం చేశానేమో! కాని నా మనసు తెలుసుకుని నన్ను అర్థం చేసుకుంటుందనే అనుకుంటున్నాను" అన్నాడు రవి సుధ ఒడిలో తల పెట్టుకుని.

అతని ముఖాన్ని అరచేతుల్లో బంధించి వంగి నుదుటిమీద గట్టిగా ముద్దు పెట్టు కుంది సుధ

మసక చీకట్లు ముసురుకున్నాయి. పక్షులు గుంపులుగా గూటికి చేరుకుంటున్నాయి. దూరంగా సముద్రంలోంచి ఉదయిస్తున్న చంద్రుడు వాళ్ళిద్దర్నీ చూసి నిండుగా నవ్వుకున్నాడు.

(అయిపోయింది)

# "కేర్‌ఫ్రీ రక్షణ —దానిలా మరొకటి లేదిక!"

మిమ్మల్ని దృష్టిలో పెట్టుకుని తయారుచేసారు కేర్‌ఫ్రీ. ఇబ్బందైన ఆ 5 రోజుల్లో ఆధునిక యువతికి కావలసిన శుభ్రత కూడిన ఆ సంరక్షణని యిస్తుంటది.

మీకు అధిక రక్షణ యివ్వడానికి దీనిలో మరింతగా పీల్చుకునే గుణం

కేర్‌ఫ్రీ శాస్త్రీయంగా రూపొందించబడినది. దీని లోపల భాగంలో గల మెత్తని పొరలు, ప్రత్యేకమైన రీతిలో పీల్చుకోగలిగే పదార్థంతో చేయబడ్డాయి కేర్‌ఫ్రీ మీకు యిప్పటి దాకా వాడిన వాటి అన్నిటి కన్నా చెమ్మను నిలుపుకోగలుగుతూ, మీకు మరింతగా రక్షణని యిస్తుంది అయినా యిది ఎంతో సన్నగా, సున్నితంగా, యిమడికగా ఉంటుంది

అద్వితీయమైన దీనికిగల ప్లాస్టిక్ కవచం మరకలు పడటాన్ని నిరోధిస్తుంది.

కేవలం కేర్‌ఫ్రీలోనే క్రింది భాగం చుట్టూరా, నేప్‌కిన్‌కి



రెండు వైపులా గల 3-వైపుల గల నీలి ప్లాస్టిక్ కవచం మధ్యన అడుగా నిలవడం కోసం ఉంది అందుకే యిది తడిసి పోతుందని గాని, మరకలు పడుతుందని గాని భయం లేదు

ఎంతో సౌకర్యం మరెంతో వీలు

కేర్‌ఫ్రీ మీకు పూర్తిగా సౌకర్యాన్నిస్తుంది దీన్ని వాడటం పారెయ్యడం ఎంతో తేలిక. దీన్ని ఫ్లష్ చేసెయ్యండి, అంతే మార్చుకోవడం కూడా వీలు మీరెప్పుడు మార్చవలసివచ్చినా మీకెంతో సౌకర్యం

అవును కేర్‌ఫ్రీతో మీరెంతో భద్రంగా, ఎంతో సౌకర్యంగా ఉంటారిక అసలు నెలలో అది ఏ రోజూ అనే ధ్యాసే ఉండదు మీరిక ఏం చెయ్యదలుచుకున్నా చేఫికరుగా చేయగలరు మరి ఎందుకంటే మరేదీ యివ్వలేని రక్షణను యిస్తుంది కేర్‌ఫ్రీ!

ఇది 10 మరియు 20 నేప్‌కిన్స్ ప్యాక్‌లలో దొరుకుతుంది.




Johnson & Johnson*



## కేర్‌ఫ్రీ*—కాలం మారుతున్నయీ రోజుల్లో పూర్తి రక్షణ

పెద్ద కథ

# ఓ సత్యం కథ

## గరికపాటి కృష్ణమూర్తి

3

(గత సంచిక తరువాయి)

**జరిగిన కథ - 1** పరశురామయ్యగారి పొలాన్ని హరిజనుల ఇళ్ల స్థలాల కోసం పెట్టిన వెంకడిని ఆయన పాలేరు లక్ష్మడు కొట్టి చంపుతాడు. ఈ కేసుపై వాంగ్మూలం ఇవ్వటానికి వెంకడు అన్నకొడుకు సుగుణరావ్‌తో పాటుగా సత్యం కూడా వెళ్లాడన్న వార్త ఆ వూరిలో కలకలం రేపుతుంది రామనాథం, శాంతమ్మల కొడుకు సత్యాన్ని పరశురామయ్య తమ్ముడు రాజయ్య తన కూతురును అతనికిచ్చే ఉద్దేశ్యంతో ఎం.బి.బి.యస్. చదివిస్తుంటాడు.

సంధ్యారుణ కాంతి గోదావరిమీద పడుతోంది.

గోదావరి కన్నకడుపులా వేడిగాల్పుల్ని మింగి చల్లని వాయువుల్ని పంపిస్తోంది.

సత్యం గట్టుమీద కూర్చుని పిల్లవాయువుల్ని పీలుస్తున్నాడు. ప్రకృతి సౌందర్యాన్ని తిలకిస్తున్నాడు.

దగ్గరలో సామ్రాజ్య విస్తరణ కాంక్ష గల నియంతలా మర్రిచెట్టున్నది.

కొంచెం దూరంలో జీవిత నిమ్నోన్నతాలను తెలిపే రెండు కొండలు – వాటిమధ్య లోయ

ఇంకా దూరంగా దృష్టి సారిస్తే ఆ కొండల వెనుక ఆకాశం భూదేవిని ముద్దాడుతున్న క్షితిజరేఖ

తన్మయుడై చూస్తున్న సత్యానికి దూరంగా గోదావరిలో నీలాటి రేవువద్ద యిద్దరాడపిల్లలు బిందెలతో నీళ్లు తీసుకెళ్లటం మానింది.

పొద్దు వాలిపోతూంది.

ఇంటి కెళ్లాలని దారిపట్టాడు.

ఆ పిల్లలిద్దరూ పరిహాసాలాడుకుంటూ వస్తున్నారు.

సత్యం యెదురుపడ్డాడు

కళ్యాణికి సిగ్గు ముంచుకొచ్చింది.

పద్మ ముసిముసి నవ్వులు నవ్వుకొంటున్నది.

సత్యం కళ్యాణివంక తదేకంగా చూస్తున్నాడు. కళ్యాణి సిగ్గుతో ముడుచుకుపోతోంది. ఒకసారి క్రీగంటితో సత్యంవంక చూసింది. చిలిపిగా చూస్తున్నాడు. బుగ్గలు యెరుపెక్కినయ్ గుండె కొట్టుకుంటున్నది. కళ్లు దింపేసింది. కాలిగోటితో నేలను రాస్తూవుంది

కళ్యాణి రోజు రోజుకు అందాన్ని సంతరించు కొంటోంది. అసలే చక్కటి రూపం. పసిమిఛాయ. కొనదేలిన ముక్కు. విశాలమైన కళ్లు, పల్చగా, నాజూగ్గా ఉన్న ముఖవర్చస్సు అసలే చక్కని రూపానికి వయసు మరింత అందాన్ని చేకూర్చింది.

అదే ధ్యాసలో చూస్తున్న అన్నయ్యను 'ఏం అన్నయ్యగారూ! ఇంకా సౌందర్యారాధన పూర్తి కాలేదండీ.'

పద్మ ఆటపట్టిస్తుంది.

''ఒక్క నిమిషంలో పూర్తయ్యేది ఆరాధన యెలా అవుతుందే.''

''అబ్బో! చాలావరకు వచ్చిందే. ఆరాధనలోపడి చదువు మరచిపోయేరు గనక ?''

''పద్మా! వెళ్లిపోదాం రా''

కళ్యాణి సిగ్గుకు చిరుకోపాన్ని మేళవించి అన్నది

''మీ శ్రీమతిగారు. . తప్పు తప్పు. కాబోయే శ్రీమతిగారి ఆజ్ఞానుసారం సెలవు పుచ్చుకుంటున్నాం ''

నవ్వుకుంటూ వాళ్లిద్దరూ ముందుకెళ్లిపోయారు.

సత్యం అలా నడుచుకుంటూ యింటిదారి పట్టాడు.

సెలవుల్లో సత్యం దినచర్య యిది. ఇలా ఒక గంటైనా కాలక్షేపం చెయ్యనిదే తోచదు

ఇలా వచ్చేటప్పుడే ఈ దారుణ సంఘటన జరిగింది

ఆర ఫర్లాంగు దూరంలోనున్న యీ హత్యను సుందరరామయ్య చూస్తూనే ఉన్నాడు చెంబు తీసుకొనివచ్చిన ఆచారిగారూ చూశారు.

కాని పోలీసులముందు యెవరూ చెప్పటంలేదు.

కాని తను మాత్రం జరిగింది జరిగినట్లు అంతా చెప్పి వచ్చాడు.

వాగ్మూలం చెప్పటానికెళ్లిన సత్యం యింటి కొచ్చేటప్పటికి యిల్లంతా విచార సాగరంలో మునిగి పోయినట్లుంది.

శాంతమ్మ దిగాలుపడిపోయి ఒకమూల కూర్చుంది. పద్మ గుమ్మంలో నిలబడి వేలాడుతోంది. రామనాథం పడుము విరిగిపోయిన పాడిలా మంచంలో అటూ ఇటూ కదులుతున్నాడు.

సత్యం యిటు ఇంట్లోకి రావటం, అటు రాజయ్య నిష్క్రమించటం ఒకేసారి జరిగినవి.

పెనుతుఫాను వీచబోయే ముందున్న ప్రశాంతతలా ఉన్నది వాతావరణం

నిగ్రహించుకోలేని ఆగ్రహావేశాలు వారిముఖాల్లో చోటు చేసుకున్నయ్.

అందరూ సత్యం వంక తదేక దృష్టిని సారించారు.

రోటిలో తలదూర్చి రోకటి పోటుకు వెరవట మెందుకని సరాసరి రంగంలోకి దిగాడు.

''అంత చేయగూడని పనేమి చేశానని అంతగా బాధపడుతున్నారు ''

తల్లి అందుకొన్నది. ''చేసేదేదో – చేయ కూడనిదేదో నిర్ణయించుకొనే పెద్దవాడివైన తర్వాత మేం చేసేదేముంది ? చెప్పేదేముంది బాధ పడటం మినహా.''

అమ్మ అలా బాధ పడటం యేనాడూ చూడ లేదు సత్యం.

''పెట్టేచెయ్యిను కొట్టేవాడెటువంటివాడే ?'' నాన్న తనతో మాట్లాడమే యిష్టంలేనట్లు తల్లితో ఒక విసురు విసిరేశాడు.

''భోంచేద్దువుగాని రా అన్నయ్యా.''

పద్మకిది చిలికి చిలికి గాలివాన అవుతుందేమో నని భయంగా ఉన్నది.

ఈ కోపతాపాలలో యేం చెప్పినా విన్పించుకునే టట్లులేరని సత్యం కూడా పద్మవెంట వంటింట్లోకి నడిచాడు.

పద్మ వడ్డిస్తూ రాజయ్య మామయ్య ఎందుకు వచ్చింది, తను సాక్ష్యం ఇస్తే పర్యవసానాలు ఎలా ఉండేది వాళ్లు మాట్లాడుకున్నదంతా చెప్పింది.

సత్యానికి భోజనం చేయబుద్ధేయలేదు. పెట్టిన నాలుగు మెతుకులు కెలికాడు. పద్మ పెరుగు వడ్డించబోయినా వారించాడు. పళ్లెంలో చేతులు కడుక్కొని బయటికి నడిచాడు

కొడుకు భోజనం చేస్తున్నందుకు శాంతమ్మ మనసు ఊరడిల్లింది. వాడు రాగానే అనే మాటలకు యెక్కడ నొచ్చుకొని అన్నం మానేస్తాడోనని బెంగ పెట్టుకొంది.

రామనాధానికి కూడా మొదటున్నంత కోపం లేదు. ఏదో కుర్రతనం ఎంత చదువుకున్నా ఉద్రేకంతో పూర్వాపరాలు తెల్సుకోకుండా వాంగ్మూలం ఇవ్వటానికెళ్లి వుంటాడని, తర్వాత వివరంగా చెప్పి, ఒప్పించి ఈ అల్లకల్లోలాల్లో చిక్కుపడ కుండా అవతలికి పంపించెయ్యవచ్చని ఆయన నమ్మకం.

రాజయ్య బావకూడా పోలీసు వాళ్లతో చెప్పి తప్పిస్తానన్నాడు.

ఎంతైనా కాబోయే అల్లుడు.

అన్నీ సవ్యంగా జరిగిపోతాయనే ఇన్నాళ్లూ చదివించాడాయన.

ఒకవేళ సత్యం వినకపోతేనో !?

అటువైపు పరశురామయ్య నుండి కూడా వత్తిడి వస్తుంది.

ఇది వారి కుటుంబ సమస్య. పరువుప్రతిష్ఠలు కాపాడుకోవటంలో ఆయన్ని కాదనగలడా ?

ఎంతైనా అన్న. రక్తసంబంధీకులు.

అల్లుడు—అందులో యింకా కాబోయే అల్లుడు కోసం అనుబంధాన్ని వదులుకొంటాడా ? రక్తపాశాన్ని కాదనగలడా ?

ఊఁహుఁ !

ఎంతగా ఆలోచించినా రాజయ్య ఇంకో విధంగా జరగటానికి ససేమిరా ఒప్పుకోడు.

సత్యం తన మాట విననినాడు సత్యాన్నే వదులుకుంటాడు.

ఒక్క సత్యాన్నే వదిలిపెడతాడా ? ఇంతవరకు పెట్టిన పెట్టుబడిని కక్కమంటాడు. వ్యాపార సరళిలో రాతకోతలు లేకపోయినా ఇస్తున్న దానిని మాత్రం తను కాదనగలడా ? అలా అన్నరోజున పూళ్లో తలెత్తుకొని తిరగగలడా ? అసలు తిరగనిస్తారా ?

ఉన్న కొండ్రనమ్మాలి. లేకపోతే ఆ కొండ్రనే ఆయనకు ధరాదత్తం చేయాలి. అప్పుడు తమ గతేంగాను. పద్మ పెళ్లి ఎలా చేయగలడు ? సంసారాన్ని ఏలా ఈదగలడు ?

రామనాథం ఆ విషమ పరిస్థితిని ఊహించలేక పోతున్నాడు.

కొలిమిలో ఇనుపముక్క కాలిపోతున్నట్లు ఆయన బుర్ర కాలిపోతోంది.

"భగవంతుడా ! అన్నిటికి నీవే శరణ్య"మని మనసులో మొక్కరిల్లి ప్రార్థించాడు.

ఆ రాత్రి రామనాథం దంపతులు కూడా సత్యాన్ని యేమీ ప్రశ్నించలేదు. ఆవేశం, ఉద్రేకాలు చల్లారిన తర్వాతనే చెప్పేదేదైనా చెవి కెక్కుతుందని కిమ్మనకుండా వూరుకున్నారు.

సత్యం కూడా మర్నాడుదయమే అన్నివిషయాలు పూసగుచ్చినట్లు చెప్పి, తను చేసినదాంట్లో తప్పేమి లేదని వారిని ఒప్పించవచ్చునన్న నమ్మకంతో ఉన్నాడు.

## 5

ఒకరోజు ఉదయం పద్మ కళ్యాణి వచ్చినట్లు చెప్పింది అన్నయ్యకు. కళ్యాణి మామూలుగా ఇంటికి రాదు. పద్మకోసం యెప్పుడైనా యింటికొస్తూ ఉండేది. ఈ సంబంధమనుకొంటున్నప్పటినుండి రావటం తగ్గించింది.

'రా కళ్యాణి ! కూర్చో !'

ఎదురుగానున్న ముక్కాలిపీటమీద కూర్చుంది.

పద్మకూడా అక్కడే ఉన్నది. ఎలాగైన కళ్యాణితోబాటు తనూ అన్నయ్యను ఈ సాక్ష్యాని కెళ్లకుండా చేయాలి. ఇంట్లో గాలి దుమారం లేవకుండా చూడాలి.

అన్నయ్య సాక్ష్యానికెళ్లితే ఆ రాత్రి రాజయ్య మామయ్య చెప్పిన పరిణామలేమిటో పద్మ చెవుల్లో గింగురుమంటూనే ఉన్నయ్. అన్నయ్య అన్నయ్యగానే ఉండాలి. కళ్యాణి వదిన కావాలి. అన్నయ్య డాక్టరు కావాలి. అదీ పద్మ కోర్కె.

"కళ్యాణి చాలా బాధ పడిపోతోందిరా అన్నయ్యా !"

"నిజం ?" చిరునవ్వుతో అడిగాడు.

కళ్యాణి గంభీరంగా ఉన్నది. తన ముందున్నప్పుడు యిదివరకున్న పిచ్చదొంతరలు లేవు.

"కారణాలేమైనా దీనివలన ఉత్పన్నమయ్యే సమస్యలకు బలిపశువులు కావటం అంత భావ్యం కాదేమోనని..." నేలజూస్తూ అంటున్నది.

సత్యం నవ్వుకున్నాడు.

"అంత స్వార్థంగా ఆలోచించమంటావా ?"

కళ్యాణి భ్రుకుటి ముడిచి 'నా అర్థం అది కాద'న్నట్లు చూసింది. కళ్యాణి అంతరార్థమేమిటో తెలుసు. కోరి కష్టాలు కొనితెచ్చుకొని తమ వాటిల్లో గిలగిల కొట్టుకోవటం భరించలేదు.

"మీరే యెందుకు సాక్ష్యం యివ్వాలి ? చూసిన వాళ్లు చాలామంది ఉన్నారుగా."

"అదే నేనూ అడుగుతున్నాను. నేనే యెందుకివ్వగూడదు ? దారుణాన్ని చూసినవాళ్లల్లో నేనూ ఒకడినేగా."

కళ్యాణి మౌనం వహించింది. ఈ లోపల పద్మ యేదో అందుకోబోయిందిగాని సత్యం వారించాడు.

"కళ్యాణి ! నీవూ చదువుకున్నదానివి. కొంచెం



బాల్‌గా అలోచించు. వీళ్లవాళ్లు సౌశీల్యానికి పోటానికి వారికేవో మంత్రించే కారణాలుండవచ్చు."

"అంటే వాళ్లు వాళ్ల స్వార్థాలు చూసుకోవచ్చుగాని, మీరు మాత్రం కాదన్నమాట. అందుకనే మిమ్మల్ని ముందు పెట్టారు."

"వారిమీద దోషారోపణ చెయ్యబోకు కల్యాణీ! వాళ్లు ముందుకు రాకపోవటానికి సంకెళ్లుండవచ్చు. వాటిని తెంచుకోలేని బలహీనులనుకుందాం కాసేపు. అయినా నీవన్నట్లు నేనుకూడా నీ మిషతో యీ సాక్ష్యం యివ్వకుంటే నేనూ స్వార్థపరుడినైపోనూ."

"అయితే మీరు మారరన్నమాట."

"నీవన్నదాంట్లోనే నేను మారానన్న సమాధానముంది. అంటే నేను మామూలు స్థితినుండి మరో స్థితి కళ్లానసేగిశా దానర్థం." లాయర్ వాదన చేసినవ్వాడు.

"మీరు బి.యల్. చదవాల్సింది."

"అంటే డాక్టరుగా రాణించలేననే?"

ముగ్గురూ నవ్వుకున్నారు.

అన్నయ్య ముఖంలో యీమధ్య నవ్వే కరువైంది. ఇప్పుడిప్పుడే పులకరిస్తోంది.

అన్నయ్య ఒక్కడేం ఖర్మ. ఇంట్లో యెవరూ ఈమధ్య నరిగ్గాలేరు.

ఒకవైపు అన్నయ్య — మరోవైపు అమ్మా నాన్నలు.

రెండూ రెండు ప్రవాహాలే. దేనిదారి దానిది లాగానే కన్పిస్తున్నది.

కల్యాణి ఆ వంతెన కట్టాలి. కల్యాణితోటే అన్నయ్యను ఒప్పించాలి.

"ఆడపిల్లల్ని బాధపెట్టటం న్యాయం కాదురా అన్నాయ్!" సంభాషణని పొడిగించే ప్రయత్నం చేసింది పద్మ.

"ఆడపిల్లలు అన్యాయాన్ని చూస్తూ వూరుకోగలరటే! రామి ఆడకూతురు గాదూ!"

సడన్‌గా ముఖ కవళికలు మారిపోయినయ్. "అది సరేననుకో. రామిమీదున్న జాలివలన దాని మొగుడిని తీసుకొని రాగలవేమిటి?"

"మంచి ప్రశ్న వేశావే పద్మా! జరిగింది అన్యాయమని ఒప్పుకొంటున్నావు. అంతవరకూ బాగానేవుంది. రెండోవైపు అదన్యాయమని తెలిసీ ఉదాసీన వైఖరి అవలంబించమంటావు. జరిగిన నష్టాన్ని పూడ్చటం అసంభవం కాబట్టి శూన్య ఫలితం కోసం శుష్క ప్రయత్నాలుచేసి చేతులు కాల్చుకోగూడదంటావు. అంతేనా?"

తను ఇన్ని అర్థాలతో అడగకపోయినా మళ్లీ యెదురు ప్రశ్న వేయకుండా అన్నయ్య వంక బేలగా, నిస్సహాయంగా చూస్తూ వుండిపోయింది.

సత్యానికి పద్మా, కల్యాణి భయాందోళనలు అర్థం కాకపోలేదు.

తనూ—తన అస్తిత్వం వారుకోరుకొనే పరిధిలోనే ఉండాలని కోరిక, ఆకాంక్ష. వారిద్దరూ కూడా వివిధ కోణాల నుండి తన కష్టసుఖాలలో భాగం పంచుకునే మాట నిజమే. వారికి తనను ప్రేమించటమే తెల్సు. ప్రేమించిన వ్యక్తి కష్టాల్లో పడటం యిష్టంలేదు.

"నువ్వేదో వూళ్లో పెద్ద నాయకుడైపోవటానికి, ఆలగాజనాన్ని ఆకట్టుకోవాలని యిదంతా చేస్తున్నావంటున్నారందరూ."

నిజమే. ఈ మాట ఆ నోటా — యీ నోటా తనూ విన్నాడు.

కాని సత్యం యేమీ మాట్లాడలేదు.

ఎటో చూస్తున్నాడు.

ఒక అన్యాయాన్ని కళ్లారా చూసి, చూసిన దానిని ఉన్నదున్నట్లుగా చెప్పటానికి కూడా అపవాదులు — అవరోధాలేనన్నమాట.

చిత్తశుద్ధితో తనకు తాను నిజాయితీగా ఉంటూ నిర్భయంగా మాట్లాడటానికి కూడా హక్కు లేదన్నమాట.

## కంప్యూటరు బస్సులు

పశ్చిమ జర్మనీలో గ్రామ ప్రాంతాలలో నివసించేవారికి రవాణా సౌకర్యం కల్పించేందుకు కంప్యూటరు పథకాన్ని ప్రవేశపెట్టారు. ఈ పథకం వలన ప్రయాణీకులు బస్సు కోసం ఎక్కువసేపు నిరీక్షించవలసిన అవసరం వుండదు. బస్ స్టాప్‌నుండి కంప్యూటరు కేంద్రానికి ఫోన్‌ద్వారా తమ గమ్యస్థానాన్ని తెలియపరిస్తే, ఆ ప్రాంతాలలో అందుబాటులో వున్న బస్సువచ్చి గమ్యస్థానం చేరుస్తుంది. గ్రామీణ ప్రాంతాలలో రెగ్యులర్ సర్వీసులు ఆర్థికంగా లాభకరంగా వుండకపోవడంతో ఈ పథకాన్ని ప్రవేశపెట్టారు. విమానాలను తయారుచేసే డోర్నియర్ సంస్థవారు ప్రభుత్వ ఆర్థిక సహాయంతో ఈ కార్యక్రమాన్ని చేపట్టారు. సంస్థకు నష్టం వాటిల్లకుండా, ప్రయాణీకులకు అసౌకర్యం ఏర్పడకుండా వుండేందుకు ఈ పథకాన్ని ప్రవేశపెట్టారు.

మనిషికుండాల్సిన కనీస మానవత — ఒక ప్రాణిని రక్షించలేని నిస్సహాయతైపోయింది. కనీసం దానిని స్వేచ్ఛగా ప్రకటించటానికి కూడా అవరోధాలేనన్నమాట.

పద్మ — కల్యాణి తమపై యుక్తికమైన ప్రేమాభిమానాలు — తన వ్యక్తిత్వ ప్రకటనకు అడ్డుగోడలు వేయమంటున్నవి.

కాని వాళ్లు భావిస్తున్నట్లు ఒక అన్యాయం పట్ల ఉదాసీన వైఖరివలన వ్యక్తిగత లాభాలు చేకూరవచ్చునుగాని అదెలా సామాజిక న్యాయమౌతుంది?

ప్రతివాడు అలా స్వార్థాన్నే చూసుకున్ననాడు యీ సమాజ అస్తిత్వమనేదే యింత కాలం యెలా మనగలిగేది?

అంటే వైయుక్తికమైన యింటరెస్ట్సులో సామాజిక న్యాయానికి, ధర్మానికి అప్పుడప్పుడూ వైరుధ్య మొస్తుందన్నమాట.

పద్మ, కల్యాణి మొదటిదానికి ప్రాధాన్యత యివ్వటంలోనూ, తను రెండోదానిని వదులుకోపోవటంలోనూ తప్పులేదు.

సాంఘిక యదార్థమనేది మనం మసలుతూ వుండే పరిస్థితుల కిచ్చే అర్థాలమీద, మనం మన పొరుగువారితో యేర్పరచుకొనే సంబంధ బాంధవ్యాలతో కూడుకొన్నదనేది సత్యం.

ఆ యదార్థం వక్రీభవించకూడదు. సూర్యరేఖల్లా సూటిగానే ఉండాలి. పట్టుకొన్నవాడిని కాల్చినాసరే నిప్పులా ఉండాలి. మలినం చేయగూడదు మసి పూయగూడదు. సత్యమే మౌనాన్ని చీల్చాడు.

"ఊళ్లోవాళ్లు అనుకునేవన్నీ నువ్వు నమ్ముతున్నావా?"

"లేదనుకో. కాని నిప్పులేనిదే పొగరాదుగా."

"పిచ్చి పద్మా! నాయకత్వమనేది యెప్పుడు పడితే అప్పుడు, యెక్కడ పడితే అక్కడ కొనుక్కునే వస్తువేమీగాదే. ఐనా తనకు తాను బాధ్యత పడలేనివాడు ఇతరులకెలా బాధ్యత పడతాడు. అటువంటివాడు నాయకుడెలా ఔతాడు."

"అంటే?" కల్యాణి ప్రశ్నించింది.

"మన మనసులో అత్యంత విచార కరమైందీ, పరిహరింపదగ్గ భాగమేదైనా ఉందంటే అది మనకు మనం నిజాయితీగా ఉండకపోవటమే. ఆ బలహీనతను మీరు నన్ను వదులుకోవద్దంటారు. మరి ఆ నిజాయితీ నాలో లేనపుడు—నాకు నేనే ఆత్మసాక్షిని కాలేనపుడు నేను చెప్పే మాటలకు విలువేముంటుంది? విన్నవాళ్లలో విశ్వాసం ఎలా కలుగుతుంది? నల్గురిలో విశ్వాసం కల్గించలేనివాడు నాయకుడెలా అవుతాడు?"

పద్మ, కల్యాణిలకు ఈ వ్యంగ్యపు మాటలు అర్థం కాకపోలేదు.

వాదనలో దిగితే ఒప్పించటం కష్టం.

అన్నయ్య తర్కం ముందు తాను అనేకసార్లు ఓడిపోతూనే వస్తోంది.

అన్నయ్యకున్నంత తెలివితేటలు తనకు లేకపోవొచ్చు. కాని వాటికంటే యెన్నోరెట్లు ప్రేమాభిమానాలున్నయ్. తనకున్న సాధనాలూ అవే.

తను అడిగిందిగాని, చెప్పేదిగాని యెంత విన్నదైనా మంకు పట్టుపట్టి బొటబొటా కన్నీళ్లు రాలిస్తే మంచులా కరిగిపోతాడు.

తనకోసం దిగివస్తాడు.

ఇష్టంలేనిదైనా చేసిపెడ్తాడు.

తనకిప్పుడు కల్యాణి కూడా సాయముంది.

ఇద్దరూ కలిసి అన్నయ్యను ఆపెయ్యాలి.

"మీకు వూరు విషయం తెల్సుగా. దిగదిగూ అనేవారేగాని చివరకు అదుకునే వారెవరు ఉండరు."

కల్యాణి భయందోళనల నన్నింటికి పరిష్కారం ఒక్కటే. న్యాయమైనదైనాసరే, దానికోసం నిలబడి అన్యాయానికి బలైపోగూడదని.

"ఔను. ఊరు విషయం తెల్సు."

ఊరు చిన్నదే. సమస్యలు మాత్రం పెద్దవిగా ఉంటూ వస్తున్నయ్.

ధనం, అధికారం, బంధుత్వం - ఆశ్రిత

# You never got so much freshness out of a pack before!

Old Spice TALC

Old Spice

the mark of a man

Quality products from Menezes-Shulton.
Mfd. By Colfax Laboratories (I) Pvt. Ltd.

Old Spice FRESH LIME TALC

Old Spice TALC

**Old Spice Talc in a trim new pack with 40g. more spice than before**

Peppery, potent Old Spice. A masculine fragrance that refreshes. Now get more of it, in a more streamlined pack than before.

CHAITRA-OS-74







పక్షపాతం — యివన్నీ యేకమై ఒక కొండచిలువలా వూరు తయారైంది.

న్యాయం, ధర్మాలు దానికి ఆహార పదార్థాలౌతున్నాయి.

ఆకలైనపుడు ఆరగించటమే దానికి తెల్సు.

దాని నోటిలోపడ్డ ప్రాణి సంకటావస్థ దానికి కాదు.

చర్మం చిట్లినా, రక్తం కారినా, ఎముకలు విరిగినా ఆఖరకి ప్రాణం పోయినా తిన ఆకలి తనది.

ఆచారి కూతురు యెందుకు రేప్ చేయబడ్డది? తప్పు తనది కాకపోయినా, మరనాడు చెరువులో దూకి యెందు కాత్మహత్య చేసుకున్నది ?

తాను చెయ్యని తప్పకు తనకు తానే యెందు కంత దారుణమైన శిక్షను విధించుకొన్నది ?

అన్యాయాన్ని, అధర్మాన్ని యెదిరించే శక్తి లేకేగాదు —

'అవమానాన్ని భరించలేక, జరిగిన దుష్కృత్యాన్ని నలుగురిలో చెప్పకోలేని ఆత్మాభిమానాన్ని చూపుకోలేక ఆ అఘాయిత్యాని కొడిగట్టింది.

ఊళ్లోవాళ్లు యేం చేయగలిగారు ?

చాటుమాటుగా జరిగిన అన్యాయానికి ఆచారి వద్ద సానుభూతిని మాత్రం విడవగల్గారు.

ఆచారి శోకతప్త హృదయాన్ని మాటంలో గుమ్మరించిన సానుభూతి మాత్రమే ఓదారుస్తుందా?

నిన్న ఆచారి కూతురు. రేపు మరో పంతులుగారమ్మాయి. ఇంకో రోజా మరో ఆనాథ.

ఈ దారుణాలిలా జరిగిపోవాల్సిందేనా ?

''రైట్ కళ్యాణి! నాకున్న విజ్ఞానం, అనుభవం పరిధిలో అర్థం చేసుకోగల్గినంత అర్థం చేసుకోగల్గాను దీంట్లో తలదూర్చటం నీవన్నట్లు కోరి కష్టాలు కొనితెచ్చుకోవటమే. కాని నన్ను వేధిస్తున్న ప్రశ్న ఒక్కటే.''

''ఏమిటి ?'' పద్మ ఆతురతతో అడిగింది, అన్నయ్య దారిలోకొస్తున్నాడు.

''మీరు కోరిన ప్రకారం ఒక అన్యాయాన్ని యెదుర్కొలేని బలహీనుణ్ణి అవుదామన్నా నన్ను వేధిస్తున్న సమస్య నా అంతరాత్మకు నేను న్యాయం చేకూర్చలేక పోతున్నాననే.''

# ఓ సత్యం కథ

విషయం మళ్లీ మొదటికొచ్చేటప్పటికి పద్మ, కళ్యాణి కూడా హతాశులయ్యారు.

ఇంతలో శాంతమ్మ వంటింట్లోనుండి చేతులు తుడుచుకుంటూ వచ్చింది.

కళ్యాణి లేచి ''నేను వస్తానండి'' అన్నది శాంతమ్మతోనే.

''అదేమిటమ్మా! ఏదో ఒకటి తేల్చుకొని వెళ్లు'' నవ్వుతూ అంది. కొడుకువైపు తిరిగి ''చెప్పరా యేం చెబుతావో.''

''పెళ్లాం మాటలని మారిపోయాడమ కొంటారని భయంగా ఉందమ్మా అన్నయ్యకు.''

కళ్యాణి 'అదేమి మాటల'న్నట్లు మోచేత్తో పొడిచింది పద్మను.

పద్మా, శాంతమ్మ నవ్వారు

''నేనొస్తానండి'' కళ్యాణి ఒంటినిండా పైట కప్పకొని వెళ్లిపోయింది

పద్మ గుమ్మంవరకూ సాగనంపి వచ్చింది.

''ఆ పిల్ల బాధ ఆ పిల్లది ఎంతైనా ఆ

తీపి అటువంటిది'' శాంతమ్మ తనలో తానను కొన్నట్లు అన్నది.

అమ్మ ముఖం వంక చూశాడు. ఒక నిమిషమ్ముందున్న సంతోష ఛాయలు మటుమాయమైనట్లున్నది.

ఎప్పుడూ ఉండే ప్రశాంతత స్థానంలో గంభీరత చోటు చేసుకున్నట్లనిపించింది. ఏనాడూ లేని భయాందోళనలు దోబూచులాడుతున్నయ్.

తనకు యే చిన్న జ్వరమొచ్చినా తనకంటే యెక్కువ బాధపడుతుంది.

తనకది సింపుల్ జ్వరం కావొచ్చు. నయం చేసుకోగల వైద్య పరిజ్ఞానంగల డాక్టరు కావొచ్చు

కాని తన చిన్నతనంలో ఏదైనా వస్తే యెలా ఆందోళనపడేదో ఈనాడూ అంతే.

దీనినిబట్టి అమాయకత్వంగానే కొట్టేయగలడా ?

లేదు.

ఆ ఆందోళన వెనకున్న హృదయాన్ని అర్థం చేసుకోగల్గితే అదెంత అమృతవాహినో తెలుస్తుంది

ఏ శాస్త్రం ఆ ప్రేమను కొలుస్తుంది ? ఏ శాస్త్రజ్ఞుడు లెక్కేసి చెప్పగలడు ?

ప్రక్కన చతికిలబడుతూ ''బాబూ సత్యం! నువ్వు చేసింది; చేయబోయేది తప్పనిగాని, ఆ కుటుంబానికి అవమానం తెచ్చే పనిగాని నిన్ను నిందించటంలేదు. రాత్రి మీ నాన్న అన్న మాటల్లో ఉద్దేశం కూడా అదికాదు. తినో... తినకో లేక తినగలిగీ తినలేకపోయో నిన్ను యీవరకు తీసుకొచ్చారాయన. నీవూ అలాగే ఆయనకు తగిన కొడుకు అనిపించుకుంటూ వస్తున్నావు, కష్టపడి క్లాసులు తెచ్చుకొంటున్నావు. పడిన కష్టానికి తగిన ఫలితాన్ని పొందుతున్నావు. మీ నాన్న పడిన కష్టానికి కూడా తగిన ఫలిత ముండేటట్లు చూడు నాయనా! ఆ తృప్తి ఆయనకి దక్కనియ్.''

గత రాత్రి నాన్న విసిరిన మాటలకు మనసులో కష్టం పెట్టుకొని, యెక్కడ యెదురు చెపుతావోనని, నాన్నను కర్తగా చేసి చెప్తున్న అమ్మ మనసుకు, లౌకిక జ్ఞానానికి లోలోన నమోవాకాలర్పించాడు.

(ఇంకా వుంది)

## వెలుతుర్లోనే చూడాలి

నేస్తం!

వెలుతుర్లోనే చూడాలి
చీకట్లో నడిచే దారిని
ఎంత దూరం చీకట్లో వెళ్ళితే
వెలుతురొస్తుందో అని
ఆ లెక్క చేసుకోవాలి
ఆ లెక్కన నడిచిపోవాలి
అలా నడుచుకున్ననాడే
జీవితం.
ఉండాలి —
జీవితానికి ఆ మాత్రం లెక్క
మనిషికి రేపు మీది చూపు.

— జి. వెంకటేశ్వర్లు



# పాపారావు ప్రేమన్నా

మహమ్మద్ మహబూబ్ అలి

"నీ పై పన్నెలా ఊడిందోయ్?" అంటే ఏం చెప్పగలడు పాపం పాపారావ్!

"అబ్బే! మరేం లేదు. కదుల్తుంటే అప్పట్లో నేనే పీకేయించుకున్నా," అని సర్దేసి రక్కున ప్లేటు మార్చేస్తుంటాడు.

ఆ కంఠధ్వనిలో ఏదో అపశ్రుతి.

విన్నవాళ్లకి అది నిజం కాదని త్రాచుపాములా తలెత్తి బుసలుకొట్టే అనుమానం.

అసలు కొన్నేళ్ల క్రితం పాపారావు పై వరుసలోని పన్నెలా ఊడిందనేది చెప్పేముందు అప్పట్లో అతని తత్వాన్ని గురించి కాసిన్ని విషయాలు చెప్పక తప్పదు.

పెళ్లికాక మునుపు పాపారావు రాజమండ్రిలో ఓ చిన్న ఉద్యోగం వెలగబెట్టేవాడు. అప్పట్లో తను చాలా తెలివైనవాణ్ణనీ, అందగాణ్ణనీ ఊహించుకునే వాడు. కాని, లోకులు మాత్రం అతన్ని తెలివి తక్కువ వాడని అనుకునేవారు. అందం సంగతటుంచి అతని రూపురేఖల్ని కూడా ఎప్పుడూ ఎవరూ పట్టించుకున్నట్టు లేదు.

తను తెలివైన వాడనే భ్రమవల్ల పాపం ఏదో చేసెయ్యాలని ఎప్పుడూ ఉబలాట పడుతూండేవాడు పాపారావు. అందుకనే అడపాదడపా లాటరీ టిక్కెట్లు కొనడం, పత్రికలకి లేఖలు వ్రాయడం, సినిమాల కెళ్లి ఆడపిల్లల్ని టిక్కెట్టు తీసిపెట్టమని బెరుగ్గా రిక్వెస్ట్ చేసి 'మేం తియ్యం!' అనిపించుకున్నాక వెర్రిముఖంతో క్యూలో నుంచోవడం, అసోసియేషన్ ఎలక్షన్లో చిన్న చిన్న స్థానాలకి పోటీచేసి ఓడిపోవడం లాంటి ఘనకార్యాలు చేస్తుండేవాడు. చదవకపోయినా లేటెస్ట్ "లైఫ్" మాగజైను కొని చేత్తో పట్టుకు తిరిగేవాడు. షేక్స్పియర్ కొటేషన్లు ఓ నోట్ బుక్‌లోనికి కాపీచేసుకుని కంఠస్థం చేసేవాడు నలుగుర్లో ఉన్నప్పుడు సమయం సందర్భం చూసుకోకుండా సంభాషణలోని ఏదో పదాన్ని పట్టుకుని దాన్ని గురించి షేక్స్పియరలా అన్నాడనే వాడు. ఏదో పిచ్చాపాటీ మాటాడుకుంటున్నప్పుడు అలా పేల్తుంటే పళ్లికిక్కి ఒళ్లుమండేది. "ఆలా అన్నది షేక్స్పియరు కాదోయ్! మిల్టను. ఆ మాత్రం తెలీదూ?" అంటూ అంతరూ ఏకమై పోయి గేలిచేసేవారు. మర్నాడు రుసరుసలాడుతూ ఆఫీసులో బుజావుగా పుస్తకం చూపించబోతే ఎవరూ పట్టించుకోకుండా పరధ్యానం చిత్తగించే వారు.

అప్పట్లో ఆడవాళ్లంటే పడిచచ్చేవాడు పాపారావు. పరాయి వాళ్లంటే మరీనూ! రాత్రి పడుకోబోయే ముందు ఆలోచనల్లో సినీ హీరోయిన్లతో రెచ్చిపోయి ప్రేమకలాపాలు ఊహించుకునే వాడు. ఒకసారి రోమాన్సు కోసం ఎక్కడికో వెళ్లి చిక్కకూడని పోలీసుల చేతుల్లో చిక్కి అతికష్టం మీద బైటపడేసరికి జేబులన్నీ ఖాళీ అయ్యాయి అలాగే ఓసారి రాత్రంతా ఆలోచించి పాపారావు రాసిచ్చిన లవ్ లెటరు ముఖానకొట్టి "మళ్లీ ఇలాంటి వెధవేషాలేస్తే ఊరుకోను," అంది టైపిస్టు పోనీలెమ్మని ఎవరూలేని టైంచూసి.

పరాయి ఆడవాళ్లని ఇట్టే లోబరచుకునే ఆకర్షణా, నేర్పూ, తెలివితేటలూ తనకి లేవనే సత్యాన్ని ముందే గుర్తించి ఉంటే పాపారావుకిన్ని తంటాలొచ్చి పడేవి కావు. పై పన్ను కూడా దక్కేది. అయితే సదరు తంటాలవల్ల ఎవరైనా చెంప ఛెళ్లుమనిపిస్తే నొప్పి ఎలా ఉంటుందీ, తల తీసేసినట్టవడమంటే ఏమిటీ వగైరా విషయాల్లో జనరల్ నాలెడ్జి పెరిగింది. ఎవరి జోలికీ పోకుండా తన పనేదో తను తగలడ్డమే శ్రేష్ఠమని కాలక్రమేణా గ్రహించి మనిషి ఓ దారికొచ్చాడు.

అయితే బుర్రలో బూజుండిన ఆ గతకాలంలో ఓసారి అనకాపల్లి వెళ్లి వాపసు రాజమండ్రి వెళ్లేందుకు సింహాద్రి ఎక్స్‌ప్రెస్ కాచ్ చేయడానికి స్టేషన్‌కెళ్లాడు పాపారావు. ఆ రోజు అనకాపల్లి స్టేషన్లో జరిగిన చిన్నసైజు డ్రామాలో మన పాపారావే హీరో!

టిక్కెట్టు కోసం క్యూలో నుంచున్నాడు తన ముందర ఏడుగురు. తాపీగా టిక్కెట్లిస్తున్నాడు కౌంటర్లోని దొర. పక్కనే లేడీస్ కౌంటరు

ఓ వెయ్యి పాతికరూపాయలున్న ప్యాంటు జేబులో దూర్చిపెట్టుకున్నాడు డబ్బెవరూ కొట్టెయ్యకుండా. రెండో చేతిలో "లైఫ్" మాగజైనూ, ఐదురూపాయలూ ఉన్నాయి

నిముషాలు గడుస్తున్నా క్యూ మాత్రం ముందుకి జరగడం లేదు.

దిక్కులు చూస్తున్నాడు

ఒకావిడెవరో అటువైపు తిరిగి ఉంది వెంటనే పాపారావుకున్న పరస్త్రీ వ్యామోహం మేల్కొంది.

"వెనుకనుంచీ పర్వాలేదు బాగానే ఉంది" పాపారావు మనసులోనే సర్టిఫికెట్ ఇచ్చేశాడు

ముఖం ఎలా ఉంటుందో చూడాలని తహ తహ, లటే ఆశగా చూపు

కాస్సేపయాక ఇటు తిరిగి దర్శనమిచ్చిందావిడ.

ఎత్తుపళ్లూ, చప్పిడి ముక్కూ.

"ధూత్!" అనుకుని ముఖం తిప్పేశాడు

వెనుకనించీ ఈ తతంగమంతా చూస్తున్నాడు వస్తాదులాంటి ఆమె భర్త. ఆ ధూతనే మాట పైకి పొరపాట్న అనలేదు గాబట్టే చట్నీ అవకుండా బ్రతికిపోయాడు.

ఓ యుగం దాటాక కౌంటర్ కన్నంలో వెయ్యి పెడితే చిల్లర లేదన్నాడు దొర. తన దగ్గర చిల్లరుందనే ఆధిక్యతని చూపిస్తూ పాపారావుని పక్కకి నెట్టేసి కౌంటర్ కన్నంలో దురుసుగా వెయ్యి దూర్చాడు వస్తాదు.

పాపారావు చిల్లర కోసం జేబులో తడుముకుంటూండగా లేడీస్ కౌంటరుకు ఓ అందమైన అమ్మాయీ, సెంటు వాసనా వచ్చాయి

వాసన తగలగానే తలెత్తి చూసి దంగయి పోయాడు పాపారావు.

ఇరవై ఏళ్లమ్మాయి చక్కని అందం, శ్రావ్యమైన కంఠంతో అడిగి గోదావరి ఎక్స్‌ప్రెస్‌కి విశాఖపట్నం టిక్కెట్టు తీసుకుని ఓవర్ బ్రిడ్జి వైపు నడిచింది ప్లాట్‌ఫాం చేరుకునేందుకు.

మహా అర్జంటుగా టిక్కెట్టు సంగతి తేల్చేసి షర్టుజేబులోనికి తోసేసి ఓవర్ బ్రిడ్జివైపు పరుగెత్తాడు ఆమె ముందు నడుస్తోంటే నీడలా వెంటపడ్డాడు పాపారావు. అంత పొడుగూ కాదు, పొట్టీకాదు. లావుకాదు, సన్నమూ కాదు. ఎర్రచీర. అదేరంగు జాకెట్టు. ఎర్రని చెప్పులూ, ఎర్రని హాండ్ బ్యాగ్, ఎర్రని గాజులు, వాటికి ఎర్రని బెల్టు. పొడవాటి జడలో ఎర్రగులాబీ, అదేరంగు రిబ్బనూ. డ్రస్సంతా ఎరుపు కావడంవల్ల ఆమె వొళ్లుకూడా లేత ఎరుపుగా కనిపిస్తోంది. తేలిగ్గా అడుగులేస్తూ నడుస్తోంది. ఇంకా శోభనం కాని పెళ్లి కూతుర్లా ఉంది. పైగా తియ్యని సెంటు వాసన. ఒళ్లంతా మత్తెక్కి బుర్ర వేడెక్కింది పాపారావుకి.

పరస్త్రీ అంటే పడిచచ్చే దుర్గుణం మళ్లీ సుడిగాలిలా చెలరేగింది పాపారావు బుర్రలో!

అలూ చూలూ లేకుండానే కొడుకు పేరన్నట్టు ఆ అమ్మాయితో చెయ్యబోయే కార్యక్రమాన్ని మనసులో చిత్రించుకుంటూ ఆలోచన మొదలెట్టాడు. ఒకవేళ ఆమె సరేనంటే తన టిక్కెట్టు కాన్సిలు చేసుకొని ఆమెచేత కూడా చేయించాలి. జేబులో పాతిక ఉంది. పదిరూపాయల్లో ఏదైనా లాడ్జిలో రూం దొరక్కపోదు. మిగతా డబ్బు పై ఖర్చులకి సరిపోతుంది. తనతో వస్తే గిస్తే ఆమె కూడా ఖర్చుపెట్టే అవకాశం లేకపోలేదు.

పలకరించి ముందు ఎలాగైనా మాటల్లోకి దింపాలి ఆపైన జాగ్రత్తగా లైన్లోనికి తీసుకు రావాలి! అదీ ప్లాను

బ్రిడ్జిమీద జనం అట్టేలేరు గబగబా నడిచి ఆమె కొద్ది దూరంమే ఉందనగా పిలిచినట్టుగా రెండుసార్లు దగ్గాడు. నడుస్తూనే తిరిగి చూచింది.

అది ముఖం కాదు చంద్రబింబం!

రియాక్షన్ బాగానే ఉంది!

అయితే ఆమె వెనక్కి తిరిగి సూటిగా చూసే సరికి బుర్రనిండా కోరికలున్న పాపారావుకి గుబులు పుట్టింది ఒళ్లంతా చల్లబడింది.

పలకరింపుగా చిరునవ్వు నవ్వబోయాడు. పాపం! నవ్వు పెగల్లేదు. పెదిమలు కొయ్యల్లా బిగుసుకుపోయాయి.

ఛ! ఛ! నవ్వి పలకరించే ఎంత మంచి అవకాశం పోయింది! పైగా చుట్టుప్రక్కల్లో ఎవరూలేని సమయం! ఇలా బిడియపడితే రోమాన్సు సాగినట్టే!

తిట్టుకున్నాడు.

ఈసారి ముందే జాగ్రత్తపడి కొన్నిసార్లు చిరునవ్వు ప్రాక్టీసుచేసి మరీ దగ్గాడు పాపారావు.

ఈసారి తిరిగి చూళ్లేదు.

ఏడుపొచ్చినంత పనైంది. మొదటిసారి నవ్వ లేకపోయినంత మాత్రాన రెండోసారి అవకాశం కూడా ఇవ్వకపోతే ఎలా?

దాదాపు ఇద్దరూ బ్రిడ్జి దాటే వరకూ దగ్గుతూనే ఉన్నాడు పాపారావు ఈసారి వెనక్కి తిరిగి కనీసం "మీకు టీబీ ఉందా?" అని అడిగినా సంబరపడిపోయి ఉండేవాడు.

ఉహు! ఆమె చూడందే!

ప్లాట్‌ఫాంమీదికి చేరాక మళ్లీ ట్రై చెయ్యాలి!

ఒక డౌటు! ఖర్మకాలి ఆమె లేడీస్ వైటింగ్ రూంలోకెళ్లి కూచుండిపోతే! అప్పుడెలా?

ఆమెవెనకాలే ఆకలిగా చూస్తూ నడుస్తున్నాడు. స్టైలైన పిరుదులు వెక్కిరిస్తున్నట్టుగా లయగా కదులుతున్నాయి.

పాపారావులో టెన్షను!

'బెడ్‌మీద మంచి రెస్పాన్సిచ్చే రకంలాగ కని పిస్తోంది. ఎలాగైనా స్నేహం చేసుకోవాలి!' అను కున్నాడు, దానికి కావలసిన ధైర్యమూ చాకచక్యమూ లేని పాపారావు!

వైటింగ్ రూంకెళ్లలేదామె. ఓ సిమెంటు సోఫామీద కూచుంది.

దటీజ్ గుడ్! బహుశా తన కోసమే అలా ఓపెన్‌గా కూచుందనే అనుమానం కూడా రాక పోలేదు పాపారావుకి.

ఇక ఫరవాలేదనుకుని గబగబా వెళ్లి నోటీస్ బోర్డు చూశాడు. రైళ్ళు లేటైతే ఎంతబాగుణ్ణు!

అనుకున్నట్టే గోదావరీ, సింహాద్రీ రెండూ లేటే! బోర్డుమీది వివరం ప్రకారం రెండూ ఓ గంట తరువాత ఇంచుమించు ఒకే టయానికొస్తాయి

తను సెకండ్‌క్లాసు పాసెంజరని తెలిసి ఎవరూ అటకాయించకుండా ఉండేందుకు ఛాతీ విరుచుకొని ఠీవి కనబరుస్తూ ఫస్ట్‌క్లాస్ జెంట్స్ వైటింగ్‌రూంలోకెళ్లి బాత్‌రూంలో శుభ్రంగా ముఖం కడుక్కుని తల మరోసారి దువ్వుకున్నాడు కాలర్‌మీద దుమ్మంటే దులిపి శుభ్రం చేశాడు. ఎంత నీట్‌గా కనపడితే అంత మంచిది మరి!

ఎర్రమ్మాయీ, తనూ ఒకరికొకరు ఏటవాలుగా కనపడేలా పెన్‌స్టాల్ దగ్గరగోడకానుకుని నుంచున్నాడు. 'లైఫ్' మాగజైను చదువుతూ న్నట్టు నటిస్తూ క్రీగంట ఆమెవేపు చూస్తూ బీటు కొట్టడం మొదలెట్టాడు.

ఒకచెయ్యి ఒళ్లోని బ్యాగ్‌మీదుంచి రెండో చేత్తో మెళ్లోని హారంతో ఆడుకుంటోంది అప్పు డపుడూ ఇద్దరి చూపులూ కలుస్తున్నాయి. విడి పోతున్నాయి.

కన్నుకొడితే!

అమ్మో! ఒకపాత అనుభవాన్ని గుర్తుచేస్తూ వద్దంది చెంప

అసలీ అమ్మాయి పడుతుందా? అలాంటిది కాకపోతే సెంటెందుకు రాస్తుంది? పైగా దగ్గితే వెనక్కి తిరిగి చూసిందిగా! ఆరేదో రెండ్రూపాయల పుస్తకంలో రాసినట్టు ఈ అమ్మాయికీ హేండ్ బ్యాగ్‌ఉంది, జుట్టుకూడా నొక్కులజుట్టే! ఈమె కూడా కాలిబొటనవేలితో నేలమీదరాస్తోంది. అలా రాస్తూ తనకేమైనా సిగ్నల్ ఇస్తోందా ఆ పుస్తకంలో రాసినట్టు?

ఆమె షోకైన అలంకరణ చూచిన కొద్దీ పాపారావుకి ఆశ పెరిగింది.

మరి స్నేహం చేసుకోవడం ఎలా?

చాలాసేపు బీటులోఉండిపోయాడు పాపారావు తన్నిచూసి నవ్వుతుందేమోనని ఆశిస్తూ, పెదిమల్ని బలవంతాన విల్చుకుని రెండుసార్లు స్మైల్ చేశాడు కూడా. పెద్దరియాక్షన్ రాలేదు.

మరోవైపునుంచీ ఇద్దరు కుర్రాళ్లు...బహుశా స్టూడెంట్సు గాబోలు ..ఆ అమ్మాయిని నవ్వించడానికి ప్రయత్నిస్తూ ఏవోసినిమాజోకులు పేలుస్తున్నారు వినపడేలా.

తొణక్కుండానే కూచుంది.

తనేదో తంటాలు పడుతూంటే మధ్యన వీళ్ల కాంపిటీషనొకటి! ఈకాలం కుర్రకారంతా ఇంతే చక్కని అమ్మాయి కనపడితేచాలు వెకిలివేషాలేస్తారు వెధవలు! వెధవలని!

ప్రయత్నం మానుకోకుండా చూపులు కలుపుతూనే ఉన్నాడు స్మైల్‌చేస్తే రెస్పాన్సులేదు. ఇంకేం చెయ్యాలో అంతుపట్టలేదు పాపారావుకి. ఏంచేద్దామన్నా చుట్టూరా జనం. హడావిడి.

మన్మథుడి సమ్మోహనాస్త్రం తెలిసినాబాగుండిపోయేది. కలువకాడ బాణంలా వెళ్లి తగలగానే



ఎర్రమ్మాయివచ్చి తనఒళ్లో వాలేది. మన్మగంధాల్లో అస్త్రాలూ, వ్యూహాలూ అంటూ వ్రాస్తారే గాని వాటివర్కింగు గురించి వివరాలిచ్చి చావరు.

పాపారావు విసుక్కున్నాడు

"అయ్యా గుడ్డివాణ్ణి ధర్మంచెయ్యండి బాబూ!" అంటూ దిగులుగా తగులుకుందో ఆకారం.

వెధవ డిస్టర్బెన్సు!

ఎప్పుడూ దానధర్మాలు చెయ్యని పాపారావు ఓ పదిపైసలిచ్చేసి వెంఠనే పీడొదిలించుకున్నాడు. ఎర్రమ్మాయి చూస్తుండగా కోప్పడ్డాలూ, కసురుకోవడాలూ చేస్తేమరి ఇంప్రెషన్ పోదూ! పైగా తను దానం చెయ్యడం చూస్తే మంచి అభిప్రాయం కూడా కలగొచ్చు

సిగిరెట్టు ముట్టించి ఓ దమ్ము పీల్చాడు.

దగ్గొచ్చి గొంతుకలో ఏదో బదులుగా 'ఖళ్ళు'మంది

నోరు మెదపక మెరుపులా చూశాడు

కాలిమీది కాలుమార్చుకుని చీర సరిచేసుకుంటోంది

ఇంకా నయం! ఇటు చూడ్లేదు!

తాపీగా బయల్దేరి ఆమెకి కనుమరుగయాక చకచకా నడిచి దూరంగావెళ్లి ఉమ్మేసి మళ్లీ అలాగే చకచకా నడిచొచ్చి దగ్గరయాక తాపీగా నడుస్తూ బీటు స్థానాన్ని చేరుకున్నాడు.

ఎందుకైనా మంచిదని సిగిరెట్టు దార్లోనే పారేశాడు.

ఏదైనా సిగ్నల్ చేస్తుందేమోనని తపన!

కాస్సేపట్లో మరో రెండు వికారాలు పాపారావు దగ్గర దాపురించాయి చచ్చినట్టు చెరో పదీ ఇచ్చాడు ఆమె చూసిందా లేదా అనేది గమనిస్తూ

అటెటో చూస్తోంది.

హుం! ఇచ్చిన ముష్టి వేష్టయిపోయింది.

మళ్లీ ప్రత్యక్షమైంది ముందొచ్చిన ఆకారం. ఆ రకాన్ని పసిగట్టాడు పాపారావు. అది గుడ్డిదని చెప్పకుంటూ మనం ఎటెళితే అక్కడికి దారి తప్పకుండా ఫాలో అయే రకం. రైలు పరుగెడుతున్నప్పుడు కూడా కంపార్ట్‌మెంట్లు మారి

## పాపారావూ – పైసన్నా

మనాయాసంగా రైలంతా తిరిగి అడుక్కునే రకం గుడ్డిది.

చెయ్యి చాచి దిగులుగా అడుగుతోంది

ఎర్రమ్మాయి ఇటే చూస్తోందని గమనించగానే ఆకారం పీక పిసికేద్దామనుకున్న పాపారావు మరో పదిపైసల బిళ్లతీసి దానిచేతిలో దయగా వేశాడు.

ఇందాకటి స్టూడెంట్సు దగ్గర్లో లేరు ఎర్రమ్మాయి దగ్గర పప్పులుడకవని గ్రహించిగాబోలు దూరంగా ఒంటరిగా ఉన్న ఓ పల్లెటూరి పిల్లని మాటల్లోనికి దింపి కాఫీ కూడా ఆఫర్ చేస్తున్నారు

యట్‌లీస్ట్ కాంపెటీషనైనా తగ్గింది!

ఇపుడేం చెయ్యాలి?

అలా ఆమె ముందర నడుచుకుంటూ వెళతూన్నట్టే వెళ్లి ఏదైనా మాటాడి పలకరిస్తేనో!

వీలుగానే వుంది ఆసోఫామీద ఓ చివర ఆమే మరోచివర ఇద్దరు నీరసించిపోయిన ముసలితొక్కులూ తప్ప ఇంకెవరూ లేరు.

ఏం మాటాడాలి?

పేరడిగితేనో!! నోనో! అంత డైరెక్టుగా మాటాడితే పళ్లురాలే అవకాశం ఉంది!

'విశాఖపట్నం వెళ్తున్నారా?' అంటే! 'నీకెందుకు?' అని కసురుకుంటుందేమో!

పోనీ 'మిమ్మల్ని ఎక్కడో చూసినట్టుందం'టేనో! 'ఎక్కడా చూళ్లేదు ఒళ్లు దగ్గరుంచుకో పొ'మ్మంటుందేమో!

అలా అనదేమోననే ఆశ మనసులో పీకుతోంది దానికి ఆమె అలంకరణా, సెంటూ, తన్ని ఇందాక తిరిగి చూడ్డం ఇవన్నీ ఆధారాలుగా కనపడ్డాయి పాపారావు బుర్రకి

ఆఖరికి ఎందుకైనా మంచిదని 'టైమెంత?' అని అడిగి చూద్దామని తీర్మానించుకున్నాడు సేఫ్‌గా ఉంటుందని

బయల్దేరాడు గుండెలో దడ!

ఆమెదగ్గరికి సమీపిస్తుండగా ఓసారి తన్ని చూచి అటెటో చూపు మళ్లించింది.

పాపారావు గుండెల్లో రైళ్లు.

బుర్రతిమ్మిరెక్కింది.

అయినా స్టైల్‌గా ఆగి చిరునవ్వులో "ఎక్స్క్యూజ్‌మి. మే ఐ నోదిటైం ప్లీజ్?" అని హుందాగా...అడుగుదామనుకున్నాడు పాపం!

అయితే, అటెటో చూస్తున్న ఆమె ముందర ఆగి పనికట్టుకుని మాటాడ్డానికి ఏదో అశక్తత అడ్డొచ్చి గొంతుకలో వెలక్కాయ పడ్డట్టయింది నడుస్తూన్న కాళ్లు ఆగకుండా అలాగేముందు కెళ్లిపోయాయి. తన్ని తనే సమర్థించుకోలేక తెల్లముఖం వేశాడు. తన పని తనకే సిగ్గనిపించింది. చెంపల మీదుగా చెమట కారుతోంది.

తన్ని గమనిస్తూన్న వాళ్ళెవరైనా చిన్నచూపు చూసి నవ్వుకుంటారేమోనని, ఏదో నిజంగానే పనున్నట్టు ప్లాట్‌ఫాం చివరిదాకావెళ్లి వేరే దారంట మరొప్లాట్‌ఫాంమీదుగా తిరిగొచ్చాడు

ఎర్రమ్మాయి లేదు?

అరె! ఏమైంది?

కష్టపడి పట్టుకుని బుట్టలోవేసుకున్న పిట్ట ఎగిరిపోయినంతగా ఆందోళనపడ్డాడు పాపారావు పిచ్చెక్కినవాడిలా రెండుప్లాట్‌ఫాంలూ తెగతిరిగాడు

నోటీస్‌బోర్డు చూస్తోంది

దగ్గరి కెళ్లాడు తియ్యని సువాసన.

పాపారావు గుండెల్లో మళ్లీ రైళ్ల పరుగు!

ఆ విధంగా హైరాన పడిపోతున్న పాపారావు అదే క్షణంలో తన జేబులోని పాతిక రూపాయలూ గొప్ప నైపుణ్యమున్న ఓ పి.పి. గారి చేతుల్లోనికి చల్లగా జారుకున్నాయన్న సంగతి గమనించలేదు

ఏమైతే అయిందని ఈ సారి గట్టిగానే ఎర్రమ్మాయికి వినపడేలా "డర్టీ ట్రైన్స్! ఎప్పుడూ లేటే," అనేసి గంపెడాశతో గుండె దడగా ఉండగా ఏమంటుందా అని చెవులు రిక్కించాడు

"యూ ఆర్ కరెక్ట్! అసలు రైళ్ల తీరేమీ బాగాలేదండీ, మొన్న నేను మద్రాసు నుంచీ వస్తుంటే ." అంటూ ఓ మగప్రాణి పక్కనించీ అందుకుంది

ఇటు సభ్యత కోసం వింటున్నట్టు పాపారావు నటిస్తుంటే అటు ఆ అమ్మాయి నడుచుకుంటూ అక్కణ్ణుంచి వెళ్లిపోయింది సెంటువాసన కూడా వెళ్లిపోయింది.

రైళ్ళు లేటవడం గురించి తనకు తెలిసిన దానికి మరో నాలుగేసి జోడించి చెప్పేస్తోందాప్రాణి

పాపారావు రక్తం కుతకుత ఉడికింది.

"ఇప్పుడే వస్తానం"టూ ప్రాణిని ఒదిలించుకుని మళ్లీ ఎర్రమ్మాయి కోసం దేవుళ్లాడుతూ అన్వేషణ మొదలెట్టాడు

ఈలోగా ఓ అప్ ట్రైనూ, ఓ డౌన్ ట్రైనూ రాబోతున్నాయని సూచిస్తూ రెండు ప్లాట్‌ఫాంల నుంచీ రెండుసార్లు గంటలు వినపడ్డాయి.

అరె! మరి కొద్దిసేపట్లో బళ్లొచ్చేస్తాయి ఈలోగానే ఏదో ఒకటి చెయ్యాలి

చకచకా గాలిస్తూ వంకరటింకరగా తిరుగుతున్నాడు

క్యాంటీన్ దగ్గర కాఫీ తాగుతోంది!



ఇదీ అసలైన స్పాటు! పక్కకి చేరాడు పాపారావు. తియ్యని సెంటువాసన.

ప్లాట్‌ఫాం నిండా ప్రయాణీకుల హడావిడి, రణగొణ ధ్వని. తనూ కాఫీకి ఆర్డరిచ్చి సర్వరు ఎటో చూస్తున్న సమయం కోసం వెయిట్ చేశాడు.

గుండె "ఢాం! ఢాం!..." అంటోంది.

బెరుగ్గా "టైమెంతండి?" అని అడగ్గలిగాడు.

"మీకూ వాచీ ఉందిగా!" అంది శ్రావ్యంగా.

"అబ్బే! ఇది కొంచెం స్లోరెండి!"

"నా వాచీ సరిగ్గా నడుస్తోందని మీకేమిటి గ్యారంటీ?"

గడుసు పిల్లే!

వెంటనే ఏం చెప్పాలో తోచక నీళ్ళు నమిలాడు పాపారావు. కనుగుడ్లు పైకి ఉబ్బుకొచ్చాయి.

అతని ఇరకాటం చూసి జాలిపడి గాబోలు "పోన్లెండి! నా వాచీలో తొమ్మిదీపదయింది" అంది.

"థ్యాంక్స్!" అన్నాడు జీరగా.

ఒణుకుతున్న చేత్తో తనవాచీ సరిచేశాడు.

ఛ! తను ఏదో మంచిసమాధానం ఇచ్చి ఉండాల్సింది! వెంటనే తట్టేచావలేదు. ఆడవాళ్లను ఇట్టే మాటల్లోకి దింపి తెగినవ్విస్తార్ట కొందరు. వెధవ రాస్కెల్స్. ఎలాచేస్తారో ఏమో!

పక్కనుంచీ ఓ బట్టతల ఈ తతంగమంతా ఏవగింపుగా చూస్తోంది.

ఎర్రమ్మాయి బ్యాగ్‌లోంచి చిల్లరతియ్యబోతే కర్చీఫ్ కిందికి జారింది. చటుక్కున ఒంగి తీసి ఆమె చేతికిచ్చాడు.

"థ్యాంక్యూ!" అంది.

మంచులో ముంచినట్టు ఐసయిపోయాడు.

"సారీ!" అని నాలిక్కరచుకుని 'నోమెన్షన్!' అన్నాడు

ఛ! ఇక్కడా తొట్రుపాటే!

సరే! అయితే ఏం? మాట కలిపాడు మాటా ఉంది వేలుపట్టుకోనిచ్చింది. ఇక జబ్బ పట్టుకోవాలి. ఎలా? క్వశ్చెన్ మార్కు! ఇక సమయం కూడా ఎంతోలేదు.

సర్వర్‌కి డబ్బులిచ్చేసి వెళ్తోంది!

అరె! తనే ఇద్దరిడబ్బూ ఇచ్చేయాల్సింది! కంగార్లో ఆ ఐడియా స్ఫురించనేలేదు మరోరాంగ్ స్టెప్!

తనుకూడా ఇచ్చేసి బయల్దేరదామని జేబులో చెయ్యివేశాడు'

ఖాళీ! అరె పాతిక రూపాయలేవీ?

జేబులన్నీ వెతికాడు. ప్చ్! కరెన్సీనిల్!

టిక్కెట్టూ, కొంతచిల్లరా మాత్రం షర్టు జేబులో భద్రంగానే ఉన్నాయి. 'లైఫ్' మాగజైను కూడా చేతిలో లేదని అప్పుడు గమనించాడు పాపారావు. ఈ అయోమయంలో ఎక్కడ జారిపోయిందో ఏమో!

దూసుకుంటూ స్టేషన్లో కొచ్చింది సింహాద్రి ఎక్స్‌ప్రెస్. జనం చెల్లాచెదరుగా బండివైపు పరుగెడుతున్నారు. గోదావరి ఎక్స్‌ప్రెస్‌కోసం వచ్చిన వాళ్లు ఈ హడావిడంతా తమాషాగా చూస్తున్నారు

తన రైలొచ్చేసిందే! ఇప్పుడేం చెయ్యాలి? డబ్బు లేందే రొమాన్స్ ఎలాసాధ్యం? అయితే అంత కష్టపడి మాట కలిపాక ఎర్రమ్మాయిని అలా వొదిలేయడమే! ఆమె 'ఊఁ' అంటే చాలు టిక్కెట్లు కాన్సిలు చేసుకున్నాక ఊళ్లోకెళ్లి తెలిసినవాళ్లదగ్గర అప్పయినా అడగొచ్చు.

సర్వర్‌కి అర్ధరూపాయిచ్చి కదిలాడు హడావిడిగా.

"మీరొక్కరే వెళ్తున్నారా వైజాగ్" టైమైపోతూండటంతో తెగింపొచ్చింది. అటో ఇటో తేల్చుకోవాలి.

"అవును"

"నేనూ రానా?"

"ఎందుకు?"

"కంపెనీ కోసం."

"అంటే?"

అడుగుతూంటే సమాధానాలైతే వస్తున్నాయి

## పాపారావూ — పై పన్నూ

మరి! తనకి అవకాశం ఇస్తోందా? ఇప్పుడేం చెయ్యాలి? ఎలా చెప్పాలి?

"నేనంటే ఇష్టంలేదా?" అనేశాడు పాపారావు.

"అంటే?"

అంటే, అంటే, అంటే! అంటే ఏంచెప్పాలి? ఆ మాత్రం అర్థం కాలేదా? తప్పకుండా అయి ఉంటుంది. తనచేత చెప్పించాలని పట్టుపడుతోందా? అయితే ఒప్పుకుంటుందా? తనతో వస్తుందా? ఎన్నో తికమకలు ఆలోచనలు. టైం లేదు. సింహాద్రి పారిపోవడానికి రెడీగా ఉంది.

అంతలోనే హడావిడి మొదలైంది. తొక్కిడి. హోరుమంటూ స్టేషన్‌లోకొచ్చి పడింది గోదావరి ఎక్స్‌ప్రెస్

జనం పరుగెడుతున్నారు. ఎగబడుతున్నారు. ఎక్కేవాళ్లని ఎక్కనివ్వడంలేదు దిగేవాళ్లని దిగనివ్వడంలేదు.



రైల్లోనికి ఎక్కడానికి ప్రయత్నిస్తోంది కేకలు అరుపులు.

అందులో "ప్లీజ్!" అన్నది పాపారావు కంఠం.

"ఈ రోజుకి ఉండిపోరాదా? ప్లీజ్!" అంటున్నాడు. హడావిడి, తొక్కిడి. వినపడిందో లేదో.

ఎవరెవరో పాపారావుని ఇష్టమొచ్చినట్టు తోసేసి లోనికి దూసుకుపోతున్నారు.

ఎర్రమ్మాయీ, సెంటువాసనా లోపలికెళ్లిపోవడం కళ్లారా చూడాల్సొచ్చింది.

కిటికీల్లోంచి గాలించి పారేస్తున్నాడు.

లోపల చోటు కోసం జనం పోటీ పడుతున్నారు.

అందరూ అడ్డే. ఎవరూ సరిగా కనపడ్డం లేదు.

మూడో కిటికీ గుండా కనిపించింది. నలుగురికి అవతల ఒకావిడ పక్కన కూచుంది. మధ్యన మరో నలుగురు చోటు దొరక్కనుంచున్నారు. మరి కొందరు అటూ ఇటూ కదుల్తున్నారు.

బైటనుంచీ తన సబ్జెక్టు బిగ్గరగా మాటాడితే కొంపలు మునుగుతాయి. లోపలికెళ్లి మాత్రం కిక్కిరిసిన జనంలో ఏం చెప్పగలడు?

కర్చీఫ్ ముఖానికి అడ్డుపెట్టుకుంది నవ్వుకుంటోందా?

ఇక లాభం లేదనిపించి నిరుత్సాహమైంది పాపారావుకి ఎంత చక్కనిపిల్ల! ఎంత ప్రయాస పడ్డాడు తను! ఆఖరికి తన ఉద్దేశం చెప్పినా ఆమె కోప్పడలేదు మరి కాస్త టైముంటే ఒప్పించగలిగి ఉండేవాడేమో! పరిచయం ఎటూ తేలకుండా కట్ అయిపోయింది. ఎంతటి మంచి అవకాశం జారిపోతోంది!

కళ్లల్లో గిర్రున నీరు తిరిగినంత పనైంది

"డ్రోం!" అంటూ వెనకనుంచి డీసెల్ ఇంజను శబ్దం విని ఉలిక్కిపడి వెనక్కి చూశాడు

సింహాద్రి కదుల్తోంది.

ఇప్పుడెలా? గోదావరి ఎక్కేసి వైజాగ్‌వెళితే? టిక్కెట్టేదీ? డబ్బేదీ? పైగా తనకి గ్రీన్‌సిగ్నల్ రాలేదే!

ఇటు ఎర్రమ్మాయినీ అటు కదుల్తున్న సింహాద్రినీ పలుమార్లు చూసి చివరికి వోడిపోయానని గ్రహించి కాలికి బుద్ధిచెప్పాడు పాపారావు.

అవతలి ప్లాట్‌ఫాం కెళ్లాలి.

పరుగెడుతోంటే ట్రాలీలూ, తోపుడుబళ్లూ, మనుషులూ, సామాన్లూ అన్నీ ఆటంకాలే అటు రైలు వేగం పుంజుకుంటోంది.

క్షణ క్షణానికి దూరమైపోతున్న గమ్యాన్ని చేరుకోవడానికి పరుగెడుతున్నాడని తెలీక పాపారావు కాళ్లకి అడ్డొచ్చిందో చెరుగ్గెడల కట్ట.

ఎగిరి ధభీమంటూ బోర్లాపడ్డాడు.

కళ్లు బైర్లు కమ్మాయి.

పై వరుసలోని ఓపంటికింద బాంబుపెట్టి బ్లాస్టింగ్ చేసినట్టయింది. రైలెళ్లి పోతోంది

దిగ్గున మళ్లీ లేచాడు.

నోట్లోంచి ఏదో కారుతోంది.

ఆఖరిపెట్టె పాపారావుని వదలేసి వెళ్లిపోతోంది

మళ్లీ పరుగు లంకించుకున్నాడు

ఎక్కడో జారిపోయింది కుడిచెప్పు.

కడ్డీలు పట్టుకుని తంటాలు పడుతూంటే ఆఖరిపెట్టెలోంచి కొన్ని బలమైన చేతులు పాపారావుని లోనికి లాగేశాయి. ఒకాయన లేచి సీటు కూడా ఇచ్చాడు. అందరూ తలోప్రశ్నా వేస్తోంటే ఏం చెప్పాలో తెలీక తలవంచుకున్నాడు పాపారావు

రెండుపళ్లమధ్య ఖాళీలో నాలిక్కికండ మెత్తగా నొప్పిగా తగుల్తోంది. నోట్లో ఏదో టానిక్‌లాంటి రుచి, పెదిమలమీదుగా రక్తం కారుతూనే ఉంది ఎవరో ఏదోసలహా ఇస్తున్నారు

తెల్లనిషర్టునిండా ఎర్రని మరకలు ఎర్రమ్మాయిని గుర్తుచేస్తూ వెక్కిరిస్తున్నాయి. తనలాగే ఒంటరిదైపోయిన ఎడమకాలిచెప్పు బోసిగా నవ్వుతోంది.

రైలు ఏనుగుబలంతో వేగం పుంజుకుంటూంటే అనకాపల్లి స్టేషన్ ప్లాట్‌ఫాంమీద రాలిపోయిన అతని పైపంటికీ పాపారావుకీ మధ్యనున్న దూరం త్వరత్వరగా పెరిగిపోతోంది. ★

సీరియల్

# నర్సింగ్‌హోం

## శ్రీరంగం

(గత సంచిక తరువాయి)

సాయంత్రం ఎనిమిది గంటలు. ఆ రోజు విశ్వం తన కేసులన్నీ ఎనిమిది దాకానే చూసేడు. మిగిలిన కేసుల్ని మర్నాడు రమ్మన్నాడు. రాజా తన చెల్లెళ్ల పెళ్లి అవగానే సికిందరాబాదుకు వచ్చేసేడు తండ్రిని మెల్లగా నచ్చచెప్పొచ్చు అన్న ధీమాతో.

ఆ మర్నాడు డాక్టర్ శేఖర్ ఢిల్లీకి వెళ్లిపోతున్నాడు. అతను తిరిగి రెండు సంవత్సరాలదాకా రాడు. అందుకే విశ్వం, రాధాకృష్ణ చిన్న ఫేర్‌వెల్ పార్టీ క్లబ్‌లో యిద్దాం అనుకుని అంతకు ముందు రోజే తీర్మానించుకుని రాజాని కూడా రమ్మని ఆహ్వానించేరు

డాక్టర్ విశ్వం డాక్టర్ చంద్రశేఖర్ని, డాక్టర్ శాంతినీ కూడా ఆ పార్టీకి పిలిచేడు.

సాయంత్రం ఎనిమిదిన్నర — డాక్టర్ విశ్వం సరిగ్గా టైముకి అతని కూతురు మాధవితో కార్లో దిగి గేటు దగ్గర నిలబడ్డాడు. ఇంచుమించు అతనితో సమంగా స్కూటర్‌మీద వచ్చేడు రాజా. రాధాకృష్ణ, అతని భార్య మొన్ననే రిపేర్ అయి అమ్మడుకు సిద్ధంగా ఉన్న అందమైన ఫియట్ కారులో వచ్చారు. డాక్టర్ చంద్రశేఖర్ క్రొత్త అంబాసిడర్ కారులో, డాక్టర్ శాంత క్రొత్త ఫియట్‌లో అయిదు నిముషాల తర్వాత వచ్చారు.

అందరూ డాక్టర్ శేఖర్ గురించి ఎదురు చూస్తున్నారు. వాళ్లు అందరూ వొచ్చిన అయిదు నిముషాలకు డాక్టర్ శేఖర్ రిక్షాలో దిగేడు క్లబ్ ముందర. అందరూ అతన్ని కలిసేందుకు ముందుకు వచ్చేరు కాని రాధాకృష్ణ మాత్రం వెనకే ఉండిపోయేడు డాక్టర్ శేఖర్, చదువుల సరస్వతి, వాకింగ్ ఎన్‌సైక్లోపీడియా ఆఫ్ సర్జరీ — కత్తిని కుంచెలా తిప్పుతూ, ఆపరేషన్లకే మెరుగులు దిద్దేవాడు, సర్జన్లచేతే బెస్ట్ సర్జన్ అని అనిపించుకున్న అతను లూజైన చొక్కా, ఐరన్‌లేని పాంటు — వొత్తుగా దువ్వుకున్న జుత్తుతో — రిక్షాలోంచి దిగుతూంటే — అతనిలో ఏదో గొంతుక నొక్కేసే బాధ కలిగింది. అర్హతలేని ఎందరికి ఎన్ని ఉన్నా — అర్హత ఉన్న వొక్కడికీ అయినా అది లేకపోతే... గుర్తించలేని ప్రపంచంమీద అతనికి అసహ్యంలాంటిది కలిగింది. ఏ కేసు ఏమవుతుందో-- జబ్బుల గురించి అసలు విజ్ఞానం లేని తాము — ఎప్పుడూ టెన్షన్‌లో బ్రతుకుతూ లక్షలమీద లక్షలు గడిస్తున్నా — విజ్ఞాన సర్వస్వం అయి తన ఫీల్డులో తపస్వి అయిన శేఖర్... కాదు డాక్టర్ శేఖర్ -- అతి సామాన్యంగా నిరాధారుడిలా కనిపించేటప్పటికి రాధాకృష్ణ తన్నుతాను వోదార్చుకోలేకపోయేడు.

ఎలానో అయిపోతూన్న భర్తను మోచేత్తో పొడిచి 'ఏంటండీ యిది' అంది సుగుణ.

అతని నోరు పెగల్లేదు అతను పంగులాంటి నడకతో పక్కకుపోయి వొక నిముషం తర్వాత వచ్చేడు.

అప్పటికే అందరూ కూర్చొని ఉన్నారు.

డాక్టర్ విశ్వం తను ఏదో పోగొట్టుకోబోతున్న వాడిలా దిగులుగా కనిపించేడు. డాక్టర్ రాజాకి అసలు మాటలే రావటంలేదు. డాక్టర్ చంద్రశేఖర్, డాక్టర్ శాంత ముఖంమీద అతికి పెట్టుకున్న చిరునవ్వుతో, వాతావరణాన్ని తేలికచేయాలని చాలా ప్రయాసపడుతూన్నారు.

రాధాకృష్ణ రాగానే అతను మీనూ ఆర్డరు యిచ్చేడు. జేబులోంచి స్టేట్ ఎక్స్‌ప్రెస్ సిగిరెట్టు తీసి టేబిలుమీద ఉంచి 'అయితే సార్.. మీరు సూపర్ ఎం. యస్. చేసేంతరువాత... తిరిగి వచ్చేస్తారా సార్' అన్నాడు.

'నేను చెప్పలేను. ఈ కోర్సు అయింతరువాత ఏదైనా రిసర్చి సెంటరులో రిసర్చి గురించి వెళ్లిపోతాను నాకు యిక్కడున్న యీ కొద్ది సంవత్సరాలలో నేను మీలో వొకడ్నిగా ఉండేందుకు పనికి రానని తెలుసుకున్నాను. నా మానాన్న నన్ను యీ ప్రపంచం వొంటరిగా వొదిలేసి, నా యీ చిన్న ప్రాణంమీద కసి, ద్వేషం అంటూ ఏం చూపించకుండా ఉంటే నా బ్రతుకు, నాకు తోచిన విధంగా, బ్రతకాలని ఉంది' అతని మాటలు చాలా బరువుగా, గుండెల్ని కోసేవిధంగా ధ్వనించేయి.

డాక్టర్ చంద్రశేఖర్ వెంటనే 'డాక్టర్ శేఖర్ ! మిమ్మల్ని బాధపెట్టినందుకు క్షమించండి అని అనను, నా యీ క్షమాపణ గడచిపోయిన కాలాన్ని తిరిగి తేలేదుకాబట్టి. కాని వొకటి మాత్రం నా మనస్సులోంచి చెబుతున్నాను. నాకు మినిష్టర్లూ, ఎంపీలతో చాలా పరిచయం ఉంది. మీ సూపర్ స్పెషలైజేషన్ పూర్తి అయింతరువాత నా రాజకీయ పలుకుబడి అంతా ఉపయోగించి, జీవితంలో మీరు కావలసింది చేసేటట్టూ దానికి ఎవరూ అడ్డు రాకుండా ఉండేటట్టూ చేస్తాను. నా అసిస్టెంటు అని చెప్పే అర్హత లేకపోయినా, ఆ అర్హత తీసుకుంటూ వొక రోజు కాకపోయినా వొక రోజు అయినా, నేను కళ్లుమూసే లోపల నా అసిస్టెంటు నోబిల్‌లారెట్ అని గర్వంగా చెప్పుకోవాలి' అతని కంఠంలో నిజాయితీ ధ్వనించింది. శేఖర్ భవిష్యత్తు గురించి అతను ఎన్ని హద్దుల్లయినా దాటేటట్టు ధ్వనించేడు.

'థాంక్స్ సార్' అన్నాడు శేఖర్.

డాక్టర్ విశ్వం అందరితో 'ఇలాంటి రోజు రావాలిగాని నేను డాక్టర్ శేఖర్‌తో పనిచేసిన యీ ఆరు నెలలూ — అతిమధురమైన రోజులుగా భావిస్తాను. ఈ రోజు ఉమ నన్ను అడగవలసింది డాక్టర్ మీ జీవితంలో అతిమధురమైన ఘట్టాలు చెప్పమనీ, ఆరు నెలలు అని ఆరు నెలలు చెప్పేవాడ్ని. డాక్టర్ శేఖర్ యిన్నాళ్లు మీరు నాతో కలసి ఉన్నా వొక రోజూ నన్ను ఏదీ నోరువిడిచి అడగలేదు. కాని నేను ఎన్నో అడిగేను. దేన్నీ కాదనలేదు. ఈ రోజు నేను మరొకటి అడుగుతున్నాను దాన్నీ కాదనకండి'

**జరిగిన కథ — 14 :** డాక్టర్ రాజా ఎం. డి. లో గోల్డ్ మెడల్ సంపాయించుకొంటాడు. ఇప్పుడు అతను తన కుటుంబాన్ని మోయవలసి వుంటుంది. రాజా, మంజుల ఇరువురూ ఒకరి నొకరు పరస్పరం ప్రేమించుకొంటారు. డా. విశ్వం సహాయంతో ప్రాక్టీసు పెడతాడు రాజా. ఎం.బి.బి.యస్. పూర్తి కాకుండానే కొంత డబ్బు ఖర్చుపెట్టి ఆర్. ఎం. పి. డిగ్రీ తీసుకొని డిస్పెన్సరీ తెరుస్తాడు డా. రాధాకృష్ణ. అతను తన భార్య సుగుణకు కూడా ఓ. ఆర్. ఎం. పి. డిగ్రీ సంపాయించి ఆమెను తన డిస్పెన్సరీలోనే లేడీడాక్టర్‌గా వేసుకొంటాడు. డా. రాధాకృష్ణ ఎక్స్‌కౌన్సిలర్ సహాయంతో ఓ మందులషాపు పెట్టి, అందులో చదువూ సంధ్యా లేకుండా తిరుగుతున్న తన తమ్ముళకు దొంగ సర్టిఫికేట్లు సంపాయించి వాళ్లను అందులో వుంచుతాడు. డా. విశ్వం నర్సింగ్‌హోం మేనేజర్ జబ్బుచేసి వెళ్లిపోతే, అతను వచ్చేవరకు ఆ సీటు డాక్టర్ రాజాకు అప్పగించుతాడు విశ్వం. రాధాకృష్ణ తనను అలక్ష్యం చేస్తున్నాడని రమేష్‌ని ఆశ్రయించాలని చూసిన ఎక్స్‌కౌన్సిలర్‌ని అతను బయటికి గెంటుతాడు. ఉమ చావు రాజా, శేఖర్, విశ్వం మనస్సులలో చెరగని ముద్ర వేస్తుంది. ఇంజనీరు చదువుతున్న డా. విశ్వం ఒక్కగానొక్క కొడుకు నీటిప్రమాదంలో చనిపోతాడు. డా. విశ్వం నర్సింగ్‌హోంలో ఏటెండర్ సీను రాత్రిళ్లు జరుపుతున్న అక్రమ వ్యాపారాన్ని రహస్యంగా కనుగొని వాన్ని రూపుమాపుతాడు డా. రాజా. తను పెట్టుబడిపెట్టి ఎక్స్‌కౌన్సిలర్‌తో వడ్డీ వ్యాపారం చేయిస్తుంటాడు రాధాకృష్ణ. డా. రమేష్ వూరు విడిచి పారిపోయేటట్టు చేస్తారు రాధాకృష్ణ, ఎక్స్‌కౌన్సిలర్లు. తనకు చిన్నతనంలో ఓ యోగి ఉబ్బసం నయం అవడానికి చెప్పిన మూలికను ఉపయోగించుకొని బాగా డబ్బు సంపాదిస్తుంటాడు రాజా తండ్రి రామచందురుడు. ఇప్పుడు అతను కూతుర్ల పెళ్లిళ్లు ఘనంగా చేయ నిశ్చయించుకొటాడు. ఆ పెళ్లిళ్లు అయిన తరువాత తండ్రితో ఆ మందును ప్రభుత్వానికి అప్పజెప్పమని నచ్చజెప్పాలనుకొంటాడు రాజా.

అంటూ డాక్టర్ విశ్వం జేబులోంచి యిరవై అయిదు వేలకు రాసిన చెక్కు తీసి యిచ్చేడు.

శేఖర్ దాన్ని అతి మామూల్గా కాయితంలా జేబులో పెట్టుకున్నాడు. డాక్టర్ రాధాకృష్ణ మాత్రం ఎంతో పెద్ద లెక్చరివ్వాలనీ, తనకు తనివితీరా పొగడాలనీ వచ్చేడు కాని అతని నోటి వెంబడి వొక్క మాటకూడా రాలేదు.

తను తెచ్చిన ఫ్లాష్ కెమోరాతో అందరి ఫొటో వొకసారి, డాక్టర్ శేఖర్ ఫొటో వొకసారి తీసుకున్నాడు.

భోజనం అయింతరువాత డాక్టర్ రాధాకృష్ణ వొక బ్రీఫ్‌కేసు డాక్టర్ శేఖర్‌కి యిస్తూ 'ఉంచండి సార్' అన్నాడు.

డాక్టర్ శేఖర్ బ్రీఫ్‌కేస్‌ని అందుకుని, అందులో దొంతరులుగా అమర్చివున్న నోట్లను వొకసారి చూసి 'నాకు ఎన్నడూ అవసరంలేనివి యివి' అంటూ తిరిగి యిచ్చేసేడు.

'మీరు నా భార్యను బ్రతికించినందుకు ఏం అయినా తీసుకోవాలి సార్' అన్నాడు.

'తీసుకోమంటావా ? నువ్వు యివ్వలేవు రాధాకృష్ణా' అన్నాడు అతిమామూల్గా.

'అడగండి సార్ నా సర్వస్వం అడగండి.'

రాధాకృష్ణ ముఖంలోకి వొక్కసారి చూసేడు శేఖర్.

ఆ ముఖంలో విజ్ఞానం, ఆ కళ్లలో వెలుగు, ఆ చూపుల్లో తీక్షణత నిశ్శబ్ద తరంగాలుగా వచ్చి అతనిలో సంచలనాన్ని లేవదీసేయి.

ఇదమిద్ధం అని తెలియని ఆరాటం పెల్లుబుకుతూంటే శేఖర్ సమక్షంలో రాధాకృష్ణ తల వొంగిపోయింది అతని ప్రమేయం లేకుండానే

జీవితంలో తల వొంచని రాధాకృష్ణ తల వొంచేడు సిగ్గుతో ఆ తపస్విముందు.

* * *

డాక్టర్ శేఖర్ యింటి కెళ్లేటప్పటికి యిల్లు తాళం వేసి ఉంది. ప్రక్కింటివాళ్ల నడిగేడు 'మధు ఎక్కడికి వెళ్లింద'ంటూ ?

'ఏమో తెలియదండీ! మీరు వస్తేయియ్యా తాళం యివ్వమందితను రిక్షాలో వెళ్లిపోయింది. వెంబడి రెండు సూటుకేసులను కూడా తీసికెళ్లింది' అన్నారు

శేఖర్ తాళం తీసి లోనికి ప్రవేశించేడు.

అతని యిల్లు రెండు రూముల గది ముందర దాన్ని డ్రాయింగ్ రూం కమ్ బెడ్ రూంగా వాడుకుంటారు. రెండోది వంటిల్లు.

తన డ్రాయింగ్ రూంలో చెప్పుకోతగ్గవి అంటూ ఏంలేవు. వొక మంచం ఉన్నా అది పాతకాలం నాటిది. వొక బీర్వా. అందులో తన బట్టలూ, మధు బట్టలూ ఉండేవి. బీర్వా తెరిచేడు. అందులో తన బట్టల స్థానంలో చాలామటుకు తన సర్జరీ పుస్తకాలు ఉన్నాయి. మధు బట్టలుండే స్థలం అంతా ఖాళీ. గదంతా కలయజూసేడు. ఆమె వస్తువులన్నీ వెళ్లిపోయేయి. 'ఎక్కడికి వెళ్లిపోయి ఉంటుందో?' అన్న ఆలోచనతో మంచంమీద కూర్చున్నాడు. అతను కాయితంమీద కూర్చున్నట్టనిపించి లేచి కాయితం తీసేడు. అది మధు తనకు రాసిన ఉత్తరం 'జీవితంలో నాకు ప్రేమంటే తెలియదు కాని దుఃఖం, బాధ చాలా తెలిసింది వాటికి దూరంగా వెళ్లిపోతున్నాను. నా ప్రయాణం ఎక్కడికో నాకు మాత్రం తెలియదు' అంటూ ఉంది

శేఖర్ జీవితంలో ఆఖరు సంకెళ్లు తెగేయి

ఆమె వెళ్లిపోయిందన్న దుఃఖంగానీ, ఆమె ఉండేదన్న సంతోషంగాని రెండూ లేవు అతని జీవితంలో. ఏవి అతని ధ్యేయాన్ని అడ్డగించేందుకు అడ్డు రాలేకపోయేయి అతనికి.

ఇక అతను తపస్సు కొనసాగించేందుకు దూరాలకు వెళ్లిపోతున్నాడు



# నర్సింగ్ హోం

ఎవరికి దూరంగా ?

అజ్ఞానానికి దూరంగా — అన్వేషణకి దగ్గరగా.

* * *

శేఖర్ వెళ్లిపోయి అప్పుడే పదిహేను రోజు లయింది. విశ్వం దినచర్య మార్పులేకుండా సాగిపోతూంది. రోజూ అతని కూతురు డాక్టర్ మాధవి తండ్రివెంబడి వచ్చేది. వొకరకంగా చెప్పాలంటే శేఖర్ స్థానం ఆమె తీసుకుంది ఇద్దరూ కలసి కేసుల్ని పరీక్షించేవారు. డాక్టర్ విశ్వం కూతురన్న మొహమాటంతో, ఆమెని పరీక్ష చేయనిస్తున్నారు పేషంట్లు. ఈ సంగతి చాటుగా రాజా విన్నాడు. 'విశ్వంగారి దగ్గరికెళితే ఆయన కూతుర్ని చూడమంటారేంటి? ఇంకోళ్ల దగ్గరికి వెళ్లాలంటే సికిందరాబాదులో అసలు డాక్టర్లు అంటూ లేరా? మావాళ్లకే చూపించుకునేవాళ్లం. అంతేకాని కేసు ఎవరికి చూపించాలో యీయన చెప్పడం ఏంటి?' అంటూ నసిగేవారు

కాని అతని ముందు అనే ధైర్యం వాళ్లకు లేదు. అనలేకపోయేవారు.

మాధవి సర్జరీ బాగానే చేస్తూంది. ఆమె భవిష్యత్తులో డాక్టర్ విశ్వంలాగే కావొచ్చు. కాని తన అనుమానాలు తనకున్నాయి. అసలు జనరల్ సర్జన్‌గా ఉండి, మంచి ప్రాక్టీసు ఉన్న లేడీ సర్జన్ తన ఎరికలో లేరు. ఈ మాధనే విశ్వం ప్రాక్టీసంతా పికప్ చేస్తే, తనకు తెలిసినవాళ్లలో మాధవే మొదటి సర్జన్ అన్నమాట

విశ్వం వోపీ మునుపటిలాగే తీర్థంలా ఉంది డాక్టర్ మాధవిని విశ్వం అసిస్ట్‌చేయి అనకుండా స్వతంత్రీకరించి ఆపరేషను చేయమనేవాడు. మొదటి రెండు రోజులూ కొద్దిగా జంకినా తర్వాత ధైర్యంగా చేసేయడం మొదలుపెట్టింది. విశ్వం ప్రతీవాళ్లతో, తను చేసిన ఆపరేషన్ను కూడా మాధవే చేసింది అని చెబుతున్నాడు. పేషంట్లు ఆపరేషన్ అయింతరువాత ఆ మాట వింటే, వొద్దు అని చెప్పలేరుగా

మెల్లగా పేషంట్లకు, మాధవి మీద కొద్ది కొద్దిగా నమ్మకం కలగసాగింది. ఇప్పుడు విశ్వం పెద్ద కేసులు కూడా, మాధవిని స్వంతంగా చేయమంటున్నాడు శేఖర్ చెప్పినట్టు ఆమె చాలా మంచి సర్జన్ అవుతుంది, అన్న నమ్మకం విశ్వానికి వచ్చింది.

ఆ నర్సింగ్‌హోం బెడ్లూ, నలభై జనరల్ బెడ్లూ అతని కేసులతో నిండిపోతున్నాయి అందులో సగంపైనే మాధవి ఆపరేట్ చేసిన కేసులు.

ఎంతసేపూ తన నర్సింగ్‌హోం, కేసులూ తప్ప యింకేం ఆలోచించడా? అనుకునేవాడు రాజా. ఆడపిల్ల అన్న తరువాత ఆమె పెళ్లి భావనే కలుగటం లేదేంటి? ఈయనకు కూతురు కాదు కొడుకు ఉన్నాడన్న భావనలో ఎలా ఉండగలుగుతున్నాడు? అని రాజా అప్పుడప్పుడు ఆలోచించేవాడు

అతనికి రోజూ వొంటిగంటన్నర అయితే శేఖర్ జ్ఞప్తికి వచ్చేవాడు. అతని భార్య మధు అతన్ని విడిచిపెట్టి వెళ్లిపోయిందని అతనికి తెలిసి మొదట బాధపడ్డాడు. తర్వాత అతనికి అనిపించింది—మధు శేఖర్‌కి పెండ్లి అయిందని చాటిచెప్పేందుకే తప్ప యింకేవిధంగా ఉపయోగపడలేదనీ అతను తామరాకుమీద నీటిబొట్టులా సంచరించేడు. అసలు అలాంటి మనిషికి — పెండ్లి అనేది అతని స్వేచ్ఛనే లాక్కునే అడ్డేమో ?

కాని ఏం జరిగినా శేఖర్ నిశ్చలుడు అతన్ని ఏదీ అంటలేదు. అలాంటివాళ్లు కొందరయినా ఉన్నారు కాబట్టే — వైద్యశాస్త్రం అనే యీ సాగరంలో యింతైనా తము ముందరకు పోగలుగుతున్నారు. వారు కట్టిన తెప్పలమీదే — యీ ప్రపంచం పయనిస్తూంది. ఆలోచిస్తూన్నకొద్దీ అతనికి ఉద్వేగం కలగసాగింది.

ఇక తను శేఖర్ని చూడదు కాని—అతని గురించి వినేది సాధించిన విజయాల తర్వాతే

తను ఈమధ్య మంజాకు మూడు ఉత్తరాలు రాసేడు ఒక్కదానికీ సమాధానం లేదు. అప్పటి నించీ ఆమె గురించే ఆలోచన ఎక్కువయింది

## రంగుల వల

పార్టీల విషయంలో
సర్దుబాట్లు
దేశవ్యవస్థలో
పొరబాట్లు
యంత్రాంగంలో
కునుకుపాట్లు
ధరలు చూస్తే
ఉలుకిపాట్లు
ఎక్కడ చూసినా
తిరుగుబాట్లు
బ్రతుకు, తలుచుకొంటే,
కుక్కపాట్లు

— బచ్చు వీరరాజు

ఇప్పుడు తను మంజాను పెళ్లి చేసుకొనేందుకు ఆటంకాలేం లేవు. తొందరలో తనూ మంజూ సాంఘికంగా వివాహ రూపంలో ఏకం కావాలి

తన తండ్రి ఆ ఆస్త్మా క్యూర్ గురించి — రెండు మూడుసార్లు అడిగితే చెప్పనేలేదు అతన్ని తను విడవకూడదు — ఆ రహస్యం తెలుసుకునేదాకా వెంటపడాలి

ఈమధ్య తండ్రి రెండు ఉత్తరాలు రాసేడు అందులో అంతా తన పెళ్లి ప్రసక్తి గురించే

ఆలోచనల పరంపరలు వొకటి తర్వాత ఒకటి వస్తూంటే - వాటికి అంతరాయం కలిగించేలా నర్సింగ్‌హోం సిస్టర్ వచ్చి 'సార్ మీకు టెలిగ్రాం వొచ్చింది' అంటూ టెలిగ్రామ్ యిచ్చింది

'అందులో స్టార్ట్ ఇమీడియట్లీ మంజు' అని ఉంది

రాజా ఆ టెలిగ్రాంతో చాలా కలవరం చెందేడు 'మంజాకి ఏం అయిందో? ఎంతో చిక్కుల్లో ఉంటేనేగాని తనకు టెలిగ్రాం ఇవ్వదు తను ట్రెయిన్‌లో వెళితే? వర్నాడే తను చేరేది అప్పటిదాకా ఆరాటం భరించలేడు అందుకే ప్లేన్‌లో వెళ్లాలి' అనుకుంటూ డాక్టర్ విశ్వం దగ్గరికెళ్లి 'సార్ నేను అర్జంటుగా ఢిల్లీ వెళుతున్నా సార్ తొందరలో తిరిగి వచ్చేస్తాను' అంటూ బయలుదేరేడు

* * *

డాక్టర్ మాధవి రాత్రి పక్కమీద పడుకుని రోజూ ఆలోచించేది ఆమె ఆలోచించలేకుండా ఉండలేకపోతూంది ఆమె ఆలోచనల్ని నింపేస్తూంది డాక్టర్ శేఖర్ వొక్కడే. అతను తన కెదురుగుండా కూర్చొని పాఠంలో లీనం అయి తనకు చదువు చెప్పినరోజులు ఆమెకు తెగ జ్ఞాపకం వస్తున్నాయి. తర్వాత అతను కేసు చూడకుండానే వాళ్ల బాధవిని డయాగ్నొసిస్ చేసిన సుగుణ కేసు జ్ఞాపకం వొస్తూంది తర్వాత ఆ రోజు అదే అతను



వెళ్ళిపోయేముందు క్లబ్బులో – అందరూ కార్లలో వస్తే -- అతను రిక్షాలో దిగినవిధం -- తర్వాత ఇంటర్ స్టూడెంటులా అతను కూర్చున్న విధం – కళ్లతోనే సమర్ధవంతంగా రాధాకృష్ణకి తన ఉద్దేశాల్ని చెప్పుకున్న తీరూ – ఇవే రోజూ పదే పదే వెన్నాడేవి – తనకు నిద్ర వచ్చేదాకా

ఎందుకు శేఖర్ ఆలోచనలు తనను వెంటాడుతున్నాయి శేఖర్‌కి అంత జ్ఞాపకం చేయించుకునే పర్సనాలిటీ ఏం ఉంది ?

పొట్టీ, నలుపూ, పొత్తుజొత్తూ, లూజు చొక్కా – చూసినా కళ్లు మూసుకునే రూపం ఇది మరి ఎందుకు తరుముతున్నాయి శేఖర్ భావాలు. రోజూ తన్ను తాను ప్రశ్నించుకుంటూ నిదుర పోయేది మాధవి

* * *

విశ్వం భార్యకు వొకటే దిగులు ఈ కూతుర్ని ఏం చేయాలా? అని. ఈ పిల్లకూడా తండ్రి అడుగు జాడల్నే అనుకరిస్తూంది కొడుకుపోయి అదో గర్భశోకం, దానిమీద కూతురు తండ్రి మూసలో పడుతూందే అన్న మరోబాధ

తన భర్తకు అసలు బుద్ధిలేదు. వయసులో ఉన్న కూతురికి ఆమె మనసులో ఏముందో తెలుసుకోకుండా నర్సింగ్ హోముల వెంట తిప్పుతాడేంటి?

తనకు మొదటినించీ మాధవి అంటే కోపం

తను మెడిసన్‌కి వెళ్లొద్దంటే, అందులోనే పట్టుబట్టి చేరింది.

యంబీబీయస్‌తో సరిపెట్టుకో అంటే 'నీకు తెలియదు' అంటూ యంయస్‌లో చేరింది

ఆడపిల్లవు నీకు జనరల్ సర్జరీ ఏంటి ? ఎవరైనా నీలా జనరల్ సర్జరీ చేసినవాళ్లున్నారా అంటే 'నేను అందరిలా ఎందుకుండాలి ? వాళ్లకు ధైర్యంలేక ఇందులోకి రాలేదు నన్ను చూసిం తరువాత రావడం మొదలుపెడ్తారులే' అనేది.

పోన్లే యిదో వెర్రిబాగుల్ది ఇది యంయస్ డిగ్రీ తీసుకోగానే పెళ్లిచేసేద్దాం అంటే, తండ్రి నర్సింగ్ హోంలోకి లాగేసేడు

# నర్సింగ్ హోం

తను ఇంకో సంవత్సరం ఆగితే–ఈ పిల్లా వాళ్ల తండ్రిలాగ ఫేమస్ అవుతే -- ఈ పిల్లకు తగిన సంబంధం తనెక్కడనించి తేగలదు.

ఇప్పటికే ఆలస్యం అయింది.

విశ్వంతో మాధవి విషయం కదిలిస్తే చాలు– అతను నోరు విప్పకుండానే ఫోన్ మ్రోగుతుంది. కేసు అంటూ పరిగెడ్తాడు. పోనీ తనూ అతని వోపీలో నెంబర్ తీసుకుని లైనులోవెళ్తే మాట్లాడుతాడేమో ?

ప్రొద్దున్నలేస్తే దిగులు.

రాత్రి అయిందంటే – కూతురు వయస్సుకు మరోరోజు ఎక్కిపోయిందే అన్నబాధ

ఈ బాధల్నీ కాంపోజ్ మాత్రతో మర్నాటికి వాయిదా వేస్తూంటుంది.

* * *

డాక్టర్ రాధాకృష్ణకు అన్నిటిమీదా ఆసక్తి పోయింది అతను రోజు రోజుకీ మారిపోజొచ్చేడు అతను క్లినిక్‌లో కూర్చొని స్టెతస్కోప్ మెళ్లో తగిలించుకుని పేషంటును పరీక్షిస్తే – అతని మనస్సాక్షి –

'నీకు అసలు అర్హత అంటూ ఉందా ?' అని ప్రశ్నించేది ఆ ప్రశ్నతో అతని ముందు డాక్టర్ చంద్రశేఖర్, డాక్టర్ శాంత కళ్ల ముందు మెదిలేవారు. పోస్టుగ్రాడ్యుయేషన్ డిగ్రీ తీసుకుని – సివిల్ సర్జన్‌గా పనిచేస్తూ – ఇరవై ఏళ్లనించి ఆపరేషన్లూ చేస్తూకూడా–వాళ్ల చేతిలో పొరపాటు జరిగిందే ఆది వాళ్ళ తల్లిదండ్రులు కొట్టుకున్నా తెలియలేదే అలాంటి వ్యక్తులనే తను 'నా సుగుణ బ్రతక్కపోయిందా మిమ్మల్ని వొదలను' అంటూ హెచ్చరించేడే తను వైద్యం అంటూ ఏమీ తెలియకుండా. అసలు అనుభవమే లేకుండా జూదంలా ప్రాణాలతో ఆడుకున్నాడే ? డాక్టర్ చంద్రశేఖర్ స్థానంలో వొక రాధాకృష్ణ ఉండి ఉంటే ? నో తను ఊహించుకోలేనేలేడు వైద్యం అనేది

## హైడ్రో కాంక్రీటు !

నీటిలో కరుగని ఒక ప్రత్యేకమైన కాంక్రీటును జపానులో మూడు సంస్థలు సంయుక్తంగా అభివృద్ధి చేశాయి దీనిని "హైడ్రో కాంక్రీటు" అని అంటారు. దీనిని సముద్ర అంతర్భాగ నిర్మాణాలలో, ఉదాహరణకు సముద్రాలలో, నదులమీద వంతెనల నిర్మాణానికి వుపయోగిస్తారు. సిమెంటు, యిసుక, గులకరాళ్ళ పొడితో దీనిని తయారుచేస్తారు దీనికి గట్టితనం ఎక్కువగా వుంటుంది అందువలన నీటిలో కొట్టుకుని పోదు

విజ్ఞానుల చేతిలో ఉండాలి అంతేగాని పొట్టతిప్పలు గురించి ప్రతీవాడి చేతులోనూ .

తను వాళ్లిద్దర్నీ హెచ్చరించినట్టు తన్ను వొక్కడూ హెచ్చరించలేదు ఎందుకు ?

ఎవరైనా వొక్కరు – రాధాకృష్ణ నీ అసమర్ధతనించే–మా అమ్మాయి చాలా ప్రమాదంలో పడింది ? ఆమెగాని బ్రతక్కపోయిందా – నిన్ను వొదలను అని వొక్కడు అని ఉంటే .

ఇది అనే దేశంగాదు. ఇక్కడ ప్రాణానికి విలువేలేదు. మనుష్యులకు ధైర్యమేలేదు

మనదంతా కర్మభూమి ఇక్కడ యింకొకర్ని దూషించరు. ప్రతివాడూ తన తలరాతనే తిట్టుకుంటాడు. మన గీత, పురాణాలూ – అవే మారి ఉగ్గుపాలతో పోసేయి. ఏ వొక్కడో ఆ ఉగ్గు తాగనివాడు తనలాగ అవుతారు. మిగిలినవాళ్లంతా.. తన తలరాతను పోషించేవాళ్లలాగ తయారౌవుతారు

రాధాకృష్ణని అతని అంతరాత్మ పీడించజొచ్చింది. తన్ను తానే ప్రతీక్షణం విమర్శించుకోజొచ్చేడు

అతని మనస్సాక్షి ముందు అతని గతం చాలా ఘోరంగా అసహ్యంగా కనిపించ జొచ్చింది కళ్లు మూసుకున్నా తెరిచినా బీడీలు తాగిన రాధాకృష్ణనించి ఈ రోజు ఇరవై అయిదు లక్షల అధిపతి, ప్రపంచం దృష్టిలో ఉచ్ఛానికి వెళ్లిన రాధాకృష్ణ– అతని అంతరాత్మ దృష్టిముందు ముకుళించుకుని– సిగ్గు పడేవ్యక్తిగా కనిపించసాగేడు.

'నేనీ మనోవేదన పడలేను. అనుక్షణం నన్ను హింసించే ఈ ప్రశ్నలకి నేను తట్టుకోలేను. నేను ఏం చేయాలి ? అధః పతనానికి దిగజారిపోయిన నేను ఏం చేయాలి ?'

అనుక్షణం స్వోత్కర్ష చేసుకునే రాధాకృష్ణ దగ్గరకు వొకరోజు ప్రొద్దున్నే కౌన్సిలర్ వచ్చి 'ఏంటి డాక్టర్ ఈమధ్య మనస్సుకి జబ్బువేసిందేంటి? ఏదీ పట్టించుకోటంలేదు. నన్ను ప్లాట్ బిజినెస్ అంటూ దింపేవు. అందులో నా సర్వస్వం పెట్టేసేను. ఇక అది లాభాలు తెస్తుంది బుకింగు మొదలుపెట్టగానే అనే టైముకి – నువ్వు ఉలుకూ పలుకూ లేకుండా వాదికాదు అన్నట్టు ప్రవర్తిస్తున్నావు. మనం రేపటిలోపల రెండున్నర లక్షల



# కవితాగానం చేసే కళ్లకు...

## ఐటెక్స్

అపురూప సౌందర్యంతో పొంగిపోయే
యవ్వనంతో మురిపించే వనితల వదనాలను
ఆకర్షించే అతివల కళ్లను, ఆనందంగా
కొనచూపులతో పలుసమాడించేది ఐటెక్స్
శాస్త్రీయ విధానంలో తయారుచేయబడు
ఐటెక్స్ కాటుక అందాలు చిందేటి
యువతుల కళ్లను దోషమేమీ చేరనీయక
చల్లగా కాపాడుతుంది...

### చూపులనే మాటలుగా మార్చే ఐటెక్స్




**ఐటెక్స్** 38 సంవత్సరములుగ మీ నమ్మకానికి
పాత్రమైన ఉన్నతమైన చిహ్నం.

అరవింద్ లాబొరేటరీస్ మద్రాసు 600033

# సినిమా

## అయినింటి ఆడపడుచు

"నవంబర్ నెలాఖరుకు షూటింగ్ పూర్తవుతుంది," అన్నారు జి పి. శేఖర్ ఈయన స్క్రీన్‌ప్లే, దర్శకత్వంలో కె. ఎల్. నర్సింహులు నిర్మించే కనకధారా ఫిలిమ్స్‌వారి ఈ చిత్రం సెప్టెంబర్ 21న సెట్స్‌కు వెళ్లింది శరత్‌బాబు, శారద, సుభలత, పి.ఎల్. నారాయణ, కృష్ణమూర్తి ప్రభృత నటవర్గం. వేటూరి, గోపి గీతాలకు జె.వి రాఘవులు స్వరకర్త. సి ఎస్ శేఖర్ ఛాయ, దిలీప్‌సింగ్ శిల్పం, శివసుబ్రహ్మణ్యం నృత్యాలు, అద్దంకి సత్యనారాయణ నిర్మాణ బాధ్యతలు నిర్వహిస్తున్నారు. ఈ చిత్రం తమిళంలోనూ తయారౌతుందనీ, దానికి కథకుడు హెచ్.ఎ.ఎస్ యువరాజ్ దర్శకుడనీ ఈ చిత్రాన్ని సమర్పించే పడాలి సూర్యసత్యనారాయణ తెలియజేశారు



'అందగాడు' లో శ్రీదేవి

## మాతన నటితో నర్తకి

"ప్రధాన పాత్రకు నాట్యం తెలిసిన ఒక కొత్త నటిని పరిచయం చేయాలనుకుంటున్నాం," అన్నారు డాక్టర్ రంగారావు. ఈయన స్క్రీన్‌ప్లే, దర్శకత్వంలో తయారయ్యే 'నర్తకి' చిత్రంలో మురళీమోహన్, కవిత, శ్రీధర్, ఈశ్వరరావు, కాంతారావు, పద్మనాభం, మాడా ముఖ్యభూమికలు నిర్వహిస్తారు. అక్టోబర్ మొదటివారంలో పాటలు రికార్డవుతాయి. అక్టోబర్ ఆఖరివారంలో బుట్టాయిగూడెం, కొల్లేరు, పాపికొండలు, పట్టిసీమ ప్రాంతాలలో ఒకే షెడ్యూల్లో పూర్తవుతుందని నిర్మాణ బాధ్యతలు వహించే ఎం. సి. రాజు తెలియజేశారు.

# తల్లి పిల్లకి అందించేది...






## అపరిమితమైన మెరుపు
## ఉతుకులోని రహస్యం
## ప్రత్యేకమైన శక్తిగల
## సన్‌లైట్ ఉతుకు

రోజూ ఉతికే బట్టలకోసం, ఎంతకీ వదలని మురికిని సహితం వదిలించే దిట్టమైన సబ్బొకటి కావాలి. కాని అది బట్టల్ని పాడుచేయకూడదు, చింపకూడదు. అదే మరి సన్‌లైట్. తరతరాలనుంచీ స్త్రీలకు తెలుసు—సన్‌లైట్‌లోని ప్రత్యేకమైన ఉతికే శక్తిపైన నిక్షేపంగా ఆధారపడవచ్చని. దాంతో శుభ్రానికి శుభ్రం, సూర్యకాంతిలాంటి మెరుపు. మరోమాట—సన్‌లైట్, బట్టల్ని, వాటిని ఉతికే చేతుల్ని సున్నితంగా ఉంచేలాగ చూసుకుంటుంది. మీ కుటుంబానికి అన్నిటి కన్న మెరుగైన దానినే యివ్వాలి మరి. అదే సన్‌లైట్.

## సన్‌లైట్ ఏళ్ళతరబడి లక్షలాది స్త్రీలు నమ్ముతూ వస్తున్నది

హిందూస్థాన్ లీవర్ వారి విశిష్ట ఉత్పత్తి

లింటాస్—SUN.1-203 TL



### పి. పి. రెడ్డి దర్శకత్వంలో దేవీ కమల్ మూవీస్ చిత్రం

"అక్టోబర్ 19న తొలిపాట రికార్డు చేస్తాం నవంబర్ 23 నుండి కర్ణాటకలోని కెమ్మంగుండి పరిసర ప్రాంతాలలో పాటలు చిత్రీకరిస్తాం," అన్నారు పి. చంద్రశేఖరరెడ్డి. ఈయన కథ, స్క్రీన్‌ప్లే, దర్శకత్వంలో కె. పి. శేఖర్‌బాబు నిర్మించే చిత్రంలో కృష్ణంరాజు, జయసుధ, సత్యనారాయణ, గిరిబాబు, అల్లు రామలింగయ్య, సారథి, గీత మున్నగువారుంటారు సత్యానంద్, చక్రవర్తి, ఎస్. గోపాల్‌రెడ్డి, ప్రసాద్, వాయుని మహేశ్వరరావు, శరత్, గోపాల్ తెరవెనుక కృషి చేస్తారు.



'సుబ్బారావుకి కోపం వచ్చింది'లో నారాయణరావు

### దేవదాస్ కనకాల దర్శకత్వంలో

విశాఖపట్నం, అక్కవరం ప్రాంతాల్లో రెండు చిత్రాలు తయారవుతాయి.

"జాబిల్లి". జనవరి 14 నుంచి ఫిబ్రవరి 14 వరకు ఒకే షెడ్యూల్‌లో తయారయ్యే చిత్రానికి కొత్త నటీనటులు ఎన్నుకోబడతారు కె వి మహదేవన్ సంగీత దర్శకుడు.

"సాగర సంగమం". సతీష్, రాళ్ళపల్లి, వంకాయల, శివకుమార్, లక్ష్మీదేవి, తాతినేని రాజేశ్వరి, దేవదాస్ కనకాలతోపాటు కొందరు నూతన నటీనటులు పాల్గొనే చిత్రం షూటింగ్ ఫిబ్రవరి 14 నుంచి మార్చి14వరకు నిర్విరామంగా జరుగుతుంది. రమేష్‌నాయుడు సంగీత దర్శకుడు.

రెండు చిత్రాలకూ డిసెంబర్‌లో పాటలు రికార్డవుతాయి

## పక్కింటి అమ్మాయి లో ఎక్కింటి అబ్బాయిలు

బుచ్చిబాబు (చంద్రమోహన్) నెత్తిన గుడ్డ వేసుకుని ఒక కుర్చీలో ఏడుపుముఖంతో కూర్చొన్నాడు. ఇంతలో బాలరాజు (ఎస్. పి. బాలు) మిగతా స్నేహితులు ఉషారుగా వచ్చారు

''బుచ్చీ ! నా బుచ్చీ ! ఒక్కసారి ముద్దుగా 'గురువు బాలరాజుకు జై!' అనమ్మా!'' అన్నాడు బాలరాజా రీవిగా నిలుచొని.

బుచ్చిబాబు ముఖంగమూతెట్టుకుని, ''అనలేనాకు ఏడుపు వస్తూంటే, మధ్యన 'జై' ఏమిటిగురూ?'' అని మూల్గాడు.

''బుచ్చీ! వచ్చినా మీ మామ, ఇందువి పెళ్ళి చేసుకోడు. ఆయన బ్రెయిన్‌ని వాష్‌చేసి వచ్చాను.''

## ఇరుగు - పొరుగు

★ డైరెక్టర్ కె. బాలచందర్ ఒకప్పుడు మేస్టారుగా ఏడాదిపాటు పనిచేశారు. ముత్తుపేట జిల్లాబోర్డు హయ్యర్ సెకండరీ స్కూల్‌లో అన్‌ట్రెయిన్డ్ గ్రాడ్యుయేట్ అసిస్టెంట్‌గా పనిచేశాక మద్రాసు అకౌంటెంట్ జెనరల్ ఆఫీసులో సూపరింటెండెంట్‌గా చేరారు. ఆ తర్వాత చిత్ర దర్శకుడయ్యారు.

★ మద్రాసు యూనివర్శిటీకి చెందిన ముగ్గురు విద్యార్థులు డాక్టరేట్ కోసం థీసిస్ తయారు చేస్తున్నారు. వాళ్ళ సబ్జెక్టు ''శివాజీగణేశన్''. ఇలా ఏ నటుని గురించి ఇంతవరకు ఎవరూ థీసిస్ తయారు చేయలేదు.

★ నటి పద్మప్రియ షార్ట్‌హాండ్, టైప్‌రైటింగ్ పరీక్షలు పాసయింది.

★ ఫిజిక్స్, జాగ్రఫీ సబ్జెక్టులలో దీప ఫెయిల్ అయిందట. ప్రొఫెసర్‌ను పెళ్ళాడింది గనుక ఈమారు ఇంట్లోనే బాగా పాఠాలు నేర్చుకొని, పరీక్షల్లో పాసవవచ్చు. బెటర్ లక్ నెక్స్ట్ టైమ్! తన తమ్ముడు మార్టిన్‌ను సినిమా హీరో చేయాలని ఈమె ప్రయత్నిస్తోందట... మరో వార్త — ఈమె మూడు మాసాల గర్భిణి !

★ చంద్రకళ పరిణయమాడిన జవేద్ గడలా లోగడ ''నెరేటర్'' అనే ఆంగ్లపత్రికను నడిపారు.

★ హిందీ నటి దీప్తీనావల్ గాయని, కవయిత్రి, చిత్రకారిణి కూడా.

★ స్మితాపాటిల్ కూడా గాయని అయింది. ''రావణ్'' అనే చిత్రంలో ఒక పాట పాడింది.

★ ''మద్రాసులో సకల సదుపాయాలూ గల అత్యాధునికమైన భవంతి సినిమా షూటింగ్‌కు అద్దెకివ్వబడును'' అంటూ ''ది హిందూ'' దినపత్రికలో ఇటీవల ఒక ప్రకటన వెలువడింది.

★ మాడల్ గర్ల్ ఆర్తిగుప్త తొలిసారిగా ఒక హిందీ చిత్రంలో నటిస్తోంది. ఆ చిత్రం పేరు ''బ్లూఫిలిమ్''. కాని, నేతిబీరకాయలాగా ఆ చిత్రంలో అశ్లీలమైన, అసభ్యకరమైన సన్నివేశాలు మచ్చుకైనా ఉండవట

★ ఇటీవల రజనీకాంత్ ఒక మిత్రుని వివాహానికి సతీసమేతంగా స్కూటర్‌లో హాజరయ్యాడు. పెట్రోల్ ధర విపరీతంగా పెరిగిపోయింది కదా? మరి పొదుపు తప్పదు. రజని తెరమీద ఒకే ఒక నిమిషం కనిపించే ఓ చిత్రం తయారైంది అది ''పావ్‌కోలా'' పానీయం ప్రకటన ఇందులో డైరెక్టర్ కె. బాలచందర్, కెమెరామన్ లోకనాథ్, నటి వై విజయ కూడా కొన్ని క్షణాలపాటు కనిపిస్తారు.

★ ''ఎల్లాం ఇన్బమయమ్'' అనే తమిళ చిత్రంలో కమలహాసన్ ఎనిమిది పాత్రలు ధరిస్తున్నాడు. అవి – 1. పల్లెటూరి అమాయకపు యువకుడు. 2 నవనాగరీక కాలేజ్ స్టూడెంట్. 3. ముసలి రిక్షావాలా. 4. పాప్ సింగర్. 5 మధ్యవయస్కుడైన లాయర్. 6. పిచ్చిరెడ్డి. 7 'డ్రాకులా'లాంటి వికృతరూపి. 8. వయసుమీరిన ముస్లిమ్.

★ భారతీరాజా దర్శకత్వం వహించే ''టిక్ టిక్ టిక్'' అనే తమిళ చిత్రంలో ఫొటోగ్రాఫర్‌గా నటించే కమలహాసన్‌కు మాడల్ గర్ల్‌గా హిందీ నటి సారికా పాల్గొంటోంది. ఈ చిత్రంలో నాయిక మాధవి – తొలిసారిగా బికినీ దుస్తులలో కనిపిస్తుంది ''వెరైటీగా ఉంటుందని ఆ ఉడుపులలో నటిస్తున్నానంతే,'' అందామె

★ ''చట్టానికి కళ్ళులేవు'', ''న్యాయం కావాలి'' చిత్రాలను ఆట్లూరి పూర్ణచంద్రరావు హిందీలో నిర్మిస్తారు

★ ''ముద్ద మందారం'' చిత్రం జంధ్యాల దర్శకత్వంలోనే హిందీలోనూ తయారవవచ్చు.

★ గిరిబాబు సమర్పించే కొత్తచిత్రం మాదాల రంగారావు సారధ్యంలో తయారవుతుంది.

★ ''మరో కురుక్షేత్రం'' అనంతరం చరిత చిత్ర కంబైన్స్‌వారు ''జగన్నాధ రథచక్రాలొస్తున్నాయ్'' అనే చిత్రాన్ని నిర్మిస్తారు.

★ ''స్టార్ వార్స్'' తర్వాత జార్జ్ ల్యూకాస్ నిర్మించే మరో భారీ చిత్రం ''రైడర్స్ ఆఫ్ ది లాస్ట్ ఆర్క్''లో ఎన్నో ఫ్లయ్యింగ్ సాసర్స్, జలాంతర్గాములు ఉంటాయట. 7,500 ప్రేలుళ్ళు చిత్రీకరింపబడ్డాయట. ఈ చిత్రానికి రెట్టింపు రాబడి ఆశించబడుతోంది.

★ ప్రిన్స్ ఛార్లెస్ తన వివాహ ఆహ్వాన పత్రికను చాలా కొద్దిమందికే తన స్వదస్తూరీలో రాసి పంపాడు. ఆ కొద్దిమందిలో మనదేశంలో, ఆయన చెక్కిలిని చుంబించిన, పద్మినీ కొల్హాపురి ఒక్కతే!

'మిస్టర్ విజయ్'లో జయంతి

## సినిమా

బుచ్చిబాబు ముఖం ట్యూబ్‌లైట్‌లా వికసించింది ''గురూ! నువ్వు నిజంగా గొప్పవాడివి, గురూ ! రేపు ఫొటో తీయించుకుని నాకో కాపీ ఇయ్యి, గురూ! రోజూ పూజ చేస్తాను,'' అంటూ లేచి, ''బాలరాజు గురువికి జై!'' అని గంతులేయ సాగాడు. ఇంతలో ఎదుటి డాబామీదికి ఇందు (జయసుధ) రావడం చూసి, బుచ్చిబాబు తన మిత్రులతో ''గురూ! ఆమె గింజుకునేటట్టు డైలాగ్ కొడతాను చూడు,'' అని కాలర్ సవరించుకుని, గట్టిగా ''ఏమైనా గురూ! మా మామ చాల పెద్దమనిషి. ఈవిడగారు పెళ్ళి చేసుకుంటాననగానే ఆయన ఎగురుకుంటూ వస్తాడనుకుంది. పెళ్ళి చేసుకోను— పొమ్మన్నాడు ... గ్రేట్ ఫెలో. . అసలు మా కుటుంబంలో వాళ్ళతో కలుపుకుని అంతా గ్రేట్ ఫెలో గాళ్ళే! కాకపోతే— నేను కాస్త అమాయకుడ్ని కనుక, తన తీయటి మాటలు నమ్మి ప్రేమలో బోర్లా పడ్డాను...గురూ! ఇప్పుడు ఆ అమ్మాయి జీవితాంతం బ్రహ్మచారిణి గానే ఉండాలి కదూ పాపం?'' అంటూ ఇందు ముఖ భావాలు పరిశీలించడానికి క్రీగంట చూశాడు

ఇందు అభిమానం దెబ్బతింది ''ఏయ్, చిచ్చుబాబూ! నా గురించి ఆ కోతి మూకతో చర్చిస్తావెందుకూ? ధైర్యం ఉంటే నాతో మాట్లాడు చూడూ, ఒక్క విషయం...నువ్వు నీ పెళ్ళి గురించి ఆలోచించుకో. నాకు నీ దిక్కుమాలిన మామ కాకపోతే– మరో లక్ష మంది పెళ్ళికొడుకులున్నారు క్యూలో. అర్థమైందా, ఉడతలు పీకిన తాటి టెంకా!'' అనేసి చివాలున వెళ్ళిపోయింది.

గాలి తీసేసిన ట్యూబ్‌లా అయిపోయింది బుచ్చిబాబు ముఖం. ''గురూ! ఉడతలు తీసేసిన తాటిటెంక ఎలా వుంటుంది?'' అని అడిగాడు

బాలరాజుకు ఏడవాలో, నవ్వాలో తోచలేదు.

కె. వాసు దర్శకత్వంలో ఎ. సారధి నిర్మించే నాగార్జున ప్రొడక్షన్స్ ''పక్కింటి అమ్మాయి'' చిత్రంలో చక్రవర్తి, హేమసుందర్, చలం, రూప్ని, విజయలక్ష్మి ఇతర పాత్రధారులు. సత్యానంద్, చక్రవర్తి, ఎస్. గోపాలరెడ్డి, బి. ఎస్. కృష్ణ, నాయని మహేశ్వరరావు, శరత్, అంజిరెడ్డి, శేషగిరి రావులతో కె సి. శేఖర్‌బాబు సమర్పణ.

# ఇప్పుడు 20 పై. తగ్గింపుతో అందుకోండి

## ట్రిలో

ఇప్పటికే ఇతర వాటికన్న
25% తక్కువ ఖరీదైన
నీలి డిటర్జెంట్ బిళ్ళ!

ట్రిలోతో వచ్చే నురుగు ఎక్కువ—గనక మీరు మరెన్నో బట్టల్ని ఉతికే వీలు. మరే యితర డిటర్జెంట్ బిళ్ళతో కన్న మరింత ఎక్కువగా!

ట్రిలో ఎంతో బాగా శుభ్రపరుస్తుంది—బాగా మురికి పట్టేసిన మీ బట్టల్ని కూడా శుభ్రపరచగల శక్తిగలది యిది. దీంట్లోనే గల నీలి మందు మీ బట్టల్ని మరింత తెల్లగా, తాజాగా రూపొందిస్తుంది.



ట్రిలో మరెంతోకాలం మన్నుతుంది—ఇది ముద్దగా అయిపోదు. దీన్ని పూర్తిగా అరిగిపోయేదాకా వాడేవీలు.

అదనంగా నురుగు
అదనంగా శక్తి
అదనంగా పొదుపు

NEW Triple action
Trilo
BLUE DETERGENT WASHING TABLET
Extra lather* Extra power* Extra economy*
A Godrej Product
Trilo

ఇప్పుడే కొని చూడండి—త్రివిధ చర్యగల ట్రిలో ఎంత ఎంతెంత మేలైనదో!

గోద్రెజ్
ఉత్పాదన

CHAITRA-G-144 TEL



'రామాపురంలో సీత'లో సుజాత



# సినిమా

## విప్పుతో చెలగాటం లో సినిమా పేర్లతో గీతం

పల్లవి

కృష్ణంరాజు : మొగల్తూరు జగ్గడు
జయసుధ : ముద్దులూరు అమ్మడు
ఇద్దరూ : కలిసొచ్చారిద్దరు— మిము
                    తైమా చేస్తారిప్పుడు...

చరణం—1

పటమట పళ్లు కొరికాడంటే—
                    కటకటాల రుద్రయ్య
రమ్మను దమ్మగ కొట్టాడంటే—
                    రంగూన్ రౌడీ
కృష్ణం : కాళ్ళు పట్టుకుంటే కరిగే కన్నప్ప
                    ఒళ్లు మండిపోతే ఉరిమే పులిబిడ్డ
జయ : సైరా బెబ్బులీ...

చరణం—2

జయ : సీతారాముల జంటలాగ
                    చేరుకున్నామిక్కడకు
          శివమెత్తిన సత్యంలా
                    పాఠం చెప్తారిర ఈ నక్కలకు
కృష్ణం : గుండాలకు గుండెల్లో హడల్
                    ఈ గోల్కొండ అబ్బులు
          బడా చోరులకు గుబుల్ గుబుల్
                    ఈ బాబుల్‌గాడి దెబ్బ

హీరో కృష్ణంరాజు చిత్రాల పేర్లు కూర్చి డాక్టర్ సి. నారాయణరెడ్డి రాసిన పై గీతాన్ని సత్యం సంగీతంలో బాలు, జానకి గానం చేశారు.

"ఇంత వరకు అయిదు పాటలు రికార్డ్ చేశాం. రెడ్డిగారు రెండు, వేటూరిగారు రెండు, గోపీగారు ఒకటి రాశారు," అన్నారు వై. వి. రావ్. ఈయన నిర్మించే రవిచిత్ర ఫిలిమ్స్ 12వ చిత్రం "విప్పుతో చెలగాటం" విజయ దశమి నాడు సెట్స్‌కువెళ్ళింది. కృష్ణంరాజు (ద్విపాత్రలు), జయసుధ, కవిత, రూపా చక్రవర్తి, సుభాషిణి, శరత్‌బాబు, ప్రభాకర రెడ్డి, రావు గోపాలరావు, అల్లు రామలింగయ్య, సిలోన్ మనోహర్, విజయచందర్ ప్రభృత తారా గణంతో కొమ్మినేని స్క్రీన్‌ప్లే, దర్శకత్వబాధ్యతలు వహిస్తున్నారు. గొల్లపూడి, పి. దేవరాజ్, బి. చలం, హీరాలాల్, డి. రాజగోపాల్, కృష్ణకిశోర్, ఎస్. రామకృష్ణ, దిలీప్‌కుమార్, వి. సుందరం, పి. రఘురాం, ఆర్. పి. ఎస్. మణి తెర వెనుక కృషి చేస్తున్నారు.

## వి. మధుసూదనరావు దర్శకత్వంలో శోభన్‌బాబు

"ఇద్దరు హీరోయిన్‌లుంటారు," అన్నారు రచయిత మహారథి. ఈయన సమర్పణలో కె. ప్రభాకరరావు, కె. సాంబశివరావు నిర్మించే హేమాద్రి ఆర్ట్స్ ఫిలిమ్స్ చిత్రంలో శోభన్‌బాబు హీరో. "డిసెంబర్‌లో సాంగ్స్ రికార్డ్ చేస్తాం. జనవరిఫస్ట్ నుంచి షూటింగ్ ఉంటుంది," అన్నారు డైరెక్టర్ వి. మధుసూదనరావు. ★




## పెన్సిళ్ళన్నీ ఆకారానికి సమానమే
## కాని ఈ రకం మట్టుకు దీర్ఘకాలం వ్రాస్తాయి.

# నటరాజ్ పెన్సిళ్ళు

గ్యారంటీ : చెక్కుతున్నప్పుడు విరగదు. ఎందుకంటే, దీని "బాండెడ్ లెడ్", మిగిలిన వాటి కంటె ధాటీగా పని చేస్తుంది. మరి పెన్సిల్ ఎంత తక్కువ విరిగితే అంత ఎక్కువ కాలం మన్నుతుందన్న విషయం మీకు తెల్సుకదూ !

BONDED LEAD HB * NATARAJ *

గ్యారంటీ: అతి మృదువుగా, అతినల్లగా వ్రాస్తుంది. ఎందుకంటె, నటరాజ్ అసమానమైన లెడ్ ఫార్ములా కలిగివుంది. మైక్రొనైజ్‌డ్ గ్రాఫైట్ మరియు క్లేల మిశ్రమము.

ఇంకా, అతి ప్రత్యేకమైన శ్రేణిలో అప్సరా పెన్సిళ్ళు ! రాయుటకు, రంగులు వేయుటకు, డ్రాయింగుకు మరియు గ్లాస్ మార్కింగ్ ల కొరకు.

# నటరాజ్ దీర్ఘజీవంగల పెన్సిళ్ళు

హిందుస్థాన్ పెన్సిల్స్ ప్రైవేట్ లిమిటెడ్ 79 పాల్టన్ రోడ్, బొంబాయి 400 001.

డాక్టర్ ఎం.పి.ఆర్. రాధాకృష్ణ

# దొంగ?




బయట ఎండలాగే... మండిపోతూంది, పీతాంబరం హృదయం.

పీతాంబరానికి సాధారణంగా కోపం రాదు. కానీ... కోపంవస్తే మాత్రం, ముందు, వెనుక చూడడు.

ఆ రోజు... చాలా రోజుల తరువాత అతనికి కోపం వచ్చింది. అలా అతనికి కోపం రావడానికి కారణం... డబ్బే!

చొక్కా జేబులో ఉంచిన ఏభై రూపాయల నోటు కనపడ్డంలేదు. దానికి కాళ్ళొచ్చి నడిచే వెళ్ళిందో, రెక్కలొచ్చి ఎగిరే వెళ్ళిందో అతనికి తెలీటంలేదుగాని... మొత్తంమీద ఉండవలసిన చోట అది లేదు. పెట్టిన చోటినుండి మాయమైపోయింది.

అతనికి బాగా గుర్తు, అంతకు ముందు రోజు సాయంత్రం తనే స్వయంగా ఆ నోటును చొక్కా జేబులో పెట్టాడు.

మరది ఇప్పుడేమైనట్లు!

దాన్ని...

పనిమనిషైనా తీసి ఉండాలి. పుత్రరత్నమైనా అందుకొని ఉండాలి.

ఎవరు తీశారు?

పనిమనిషా?... కొడుకా?

చిక్కువిడని జటిల సమస్యలా తయారయింది ఏభై రూపాయల నోటు... అతని పాలిట!

పీతాంబరానికి యాభై రూపాయల నోటు ఒక లెక్కలోనిది కాదు. అతను తలచుకుంటే... అటువంటి నోట్లతో పడవలు చేసి వర్షం నీటిలో వదిలేయగలడు. అంతకంటే పెద్ద నోట్లతో... కావాలంటే సిగరెట్ వెలిగించుకోగలడు.

ఒక ఖండసారి పంచదార మిల్లు, రెండు ధాన్యం మరలు, హోల్‌సేల్ బట్టలకొట్టు, పెట్రోలు బంకు, మహాత్మా గాంధీ రోడ్డులో అతి పెద్దదైన వైను షాపు ఉన్నాయి. ఇవిగాక మంచి కలక్షన్లొచ్చే రెండు రూటు బస్సులున్నాయి. ఆ చిన్న పట్టణానికి అతనే బిర్లా!

పీతాంబరం ఖర్చు విషయంలో పిసినారి కాదు! కానీ లెక్కల విషయంలో మాత్రం ఎక్కౌంటెంట్ జనరల్ కూడా అతనిముందు బలాదూరే!

సాయంత్రమయేసరికి బాలెన్స్ షీటు అణా పైసలతోసహా సరిపోయి తీరాలి.

అతనిది అంతులేని ఆస్తని అందరూ అంటారు. అంత ఆస్తినీ అతను కష్టపడే సంపాదించాడు. అతని ఆస్తిలో ప్రతి దమ్మిడీ అతని స్వార్జితం!

పీతాంబరం... అక్కరకు వచ్చే ఆఫీసర్లకు విరివిగా 'మందు' పార్టీలిస్తాడు. వాళ్ల షోకులకు, షికార్లకు ధారాళంగా ఖర్చు చేస్తాడు. అంతేకాదు... ఓ కాలేజి పెట్టినా, ఓ అనాథ శరణాలయాన్ని నెలకొల్పినా... ఘనంగానే విరాళమిస్తాడు!

అయినా, సరే!

ఏనాటి లెక్క ఆనాడు తేలిపోవలసిందే! అది అతని సిద్ధాంతం!

జేబులోని యాభై రూపాయల నోటు కనిపించకపోయేసరికి, అతను ముందు పనిమనిషిని అనుమానించాడు.

పనిమనిషి చాలాకాలంగా పని చేస్తున్నాది ఇంటినిండా నౌకర్లున్నా... ఆవిడొక్కర్తే అన్ని గదుల్లో నిస్సంకోచంగా తిరగ్గలదు.

'ఇంత కాలం నమ్మకంగా పనిచేసింది.. ఆమె తీసి ఉంటుందా? ఏమో... డబ్బు

వేలాది కుటుంబాలు అనాదిగా వాడబడుతున్న
లవంగనూనె ప్రభావాలన్నింటినీ ప్రామిస్‌లో మళ్ళీచూసారు.

# లవంగనూనెతో కూడిన సాటిలేని టూత్‌పేస్ట్ ప్రామిస్

మీరూ ఎందుకు వాడి చూడకూడదు మరి!




**ప్రామిస్**
దంతక్షయంనుండి రక్షణకు తోడ్పడుతుంది. నోటినితాజాగా రూపొందించి దుర్వాసనను అరికడుతుంది.




బల్సారా ఉత్పాదన

ఆరోగ్యంచిందే పళ్ళు,
చిగుళ్ళు, తాజాశ్వాస–
అదే మరి ప్రామిస్ వాగ్దానం.

CHAITRA-BLS-453 TEL

ఖాళీ ట్యూబ్ ఆఫరు 31 డిసెంబరు 81 వరకు పొడిగించబడినది. వివరములకు మీ డీలరును అడగండి.

ఎదురుగా కనిపిస్తే... ఎవరి చేయి ఊరుకుంటుంది...'.

అయినా... పీతాంబరం తొందరపడి పనిమనిషిని నిలదియ్యలేదు.

'ముందు కుమారరత్నాన్నిగాడి నడగాలి. వాడికీమధ్య ఎక్కడలేని డబ్బు చాలడం లేదు...' అనుకున్నాడు !

కుమారరత్నం దర్శనభాగ్యం కలిగేసరికి... సూర్యుడు నడినెత్తిమీదికి వచ్చేశాడు.

కుమారరత్నం సాధారణంగా తండ్రితో ఎక్కువ మాట్లాడడు. ఒకవేళ మాట్లాడ్డం అంటూ జరిగితే... డబ్బు అడగడానికే మాట్లాడతాడు.

ఆ రోజు కూడా కుమారరత్నమే ముందు మాట్లాడాడు...

"డాడీ... నాకు అర్జంటుగా ఓ వెయ్యి రూపాయలు కావాలి..." అన్నాడు... వస్తూనే !

'ఎందుకోయ్...' అని తండ్రి అడక్కుండానే కారణం చెప్పాడు...

కాలేజీ ఎలక్షన్లలో ప్రెసిడెంటుగా నిలబడుతున్నాట్ట. ఈ వెయ్యి రూపాయలు కేవలం ముందు ఖర్చుల కోసమేనట. ఇంకా చాలా డబ్బు అవసరవౌతుందట !

అటువంటి చిన్న విషయాలు పీతాంబరానికి పట్టవు

"సరే...సర్లే...అలాగే..." అని క్షణం ఆగి..."నా చొక్కాజేబులోని ఏభై రూపాయల నోటుగాని తీశావా..." అని అడిగాడు !

ఏనుగుల్ని చంపే సింహాన్ని పట్టుకొని... ఎలకను చంపిందెవరని అడిగినట్టు ... తెల్లబోయాడు, కుమార రత్నం !

కొడుకు ముఖం చూడగానే అర్థమైపోయింది, వాడు దాన్ని తీయలేదని !

"సరి...సరి...వెళ్ళు ! మేనేజర్ని అడిగి డబ్బు తీసికో ... " అన్నాడు, పీతాంబరం !

మళ్ళీ అనుమానం పనిమనిషిమీదకి మళ్ళింది !

'ఏమయినా...ఈ విషయంలో తను రచ్చ చేయడు. గుంభనంగానే దొంగను పట్టేస్తాడు !

పట్టితీర్తాడు ... '

అతనలా ఓ తిరుగులేని నిర్ణయానికి వచ్చే సమయంలో భార్య వచ్చింది !

ఆవిడకు అతనితో ముప్పై రెండేళ్ల అనుభవం...

భర్త ముఖం చూడగానే ... 'ఏదో

## దొంగ?

జరిగిందని అర్థమైపోయిందామెకు !

"అలా ఉన్నారేం..." అంటూ అడిగింది!

"అబ్బే ఏంలేదు..." అని క్షణం ఆలోచించి ... "అన్నట్లు మన పనిమనిషిమీద నీ అభిప్రాయం ఏమిటి ?" అంటూ అడిగాడు!

ఆమె వెంటనే తన అభిప్రాయాన్ని చెప్పలేదు. పతిదేవుడికి ఇన్ని రోజుల తరువాత... పనిమనిషి గురించి తన సర్టిఫికెట్ ఎందుకో అర్థం కాలేదావిడకు !

"ఏమైంది ... " అంది, భర్తవైపు నిశితంగా చూసి !

"అదే..." అని చిన్నగా నసిగి..."విన్న

### సుగ్రీవులు

కట్టుకున్న వాళ్లని
ఎవడో వాలి
ఎగరేసుకుపోకుండా
గాలికి
చెయ్యి అడ్డం పెట్టే
మెరిసిన ఏకతారలు
ఏకగ్రీవంగా గెలిచిన
ధరవీరులు

— ఎమ్వీయల్

జేబులో పెట్టిన యాభై రూపాయలు కనిపించడం లేదు..." అన్నాడు !

'ఓ...అదా సంగతి...' అనుకుంది !

పనిమనిషి చాలా మంచిదనే నమ్మకం ఆమెకు బాగా ఉంది !

ముష్టి యాభై రూపాయల కోసం ... ఇంతకాలం నమ్మకంగా పని చేస్తున్నావిడను తప్పుపడితే...ఆవిడ పని మానేస్తుంది. మళ్లీ అంత నమ్మకమైన మనిషి దొరకటం కష్టం !

'ఈయనగారే...ఆ డబ్బు ఎక్కడో తగలేసి ఉంటారు...' అనుకున్న తర్వాత ఆవిడ పనిమనిషి నుండి ఆయన అనుమానాన్ని తొలగించడానికి నిశ్చయించుకుంది.

"ఓ...అదా ! ఉదయం అవసరం వస్తే... నేనే తీశాను..." అంది !

"నువ్వు తీశావా..." ఆశ్చర్యంగా అన్నాడు, పీతాంబరం !

అతనికెందుకో ఆవిడ మాటలు నమ్మాలనిపించలేదు !

"ఆ...నేనే..." అందావిడ దృఢంగా !

"యాభై రూపాయలు ?"

"అవును. యాభై రూపాయలే ! అయిదు పదులు ... "

"అయిదుపదులా..." అని ఆశ్చర్యపోయి.. "అయిదుపదులు కానే మొద్దుమొహమా ! ఒక్కటే నోటు ... ఏభై రూపాయలనోటు!" అన్నాడు, పీతాంబరం !

"దాన్ని మార్పితే అయిదు పదులు కావేమిటి ! ఏభై రూపాయల నోటైతేనేం, అయిదు పదులైతేనేం...నేనే తీశాను..." అందావిడ !

వానితో ఆ డబ్బు ఆవిడ తీయలేదని అర్థమైపోయింది, పీతాంబరానికి !

ఇక సందేహం లేదు.

ఇది...పనిమనిషి పనే !

అయితే...తను గుంభనంగా ఉంటూనే దొంగను పట్టేయాలి. అలా అనుకోగానే .. అతని కోపం మరింత పెరిగింది. బయటక్కనిపించని కోపం అది !

నిండు కుండలా ... అతను నిండుగా కోపంలో ఉన్నప్పుడు కొంచమైనా తొణకడు!

జీవితం నేర్పిన విద్య అది !

ఇంతలో...సాయంత్రం పని చేసుకోవడానికి రానేవచ్చింది, పనిమనిషి !

'ఈవిడని దగ్గరుండి కనిపెట్టాలి. డబ్బు తీసి ఉంటే ... బెదిరిపోతుంది ... ' అనుకున్నాడు, పీతాంబరం !

కూడా, కూడా తిరుగుతున్న 'అయ్యగారి'ని చూసి పనిమనిషి ముందు కొంచెం భయపడింది. తరువాత అనుమానించింది ! చివరకు తెగించి ... చీపురుకట్ట చేతోపట్టుకొని నిటారుగా నిలబడి...

"ఏటి బాబూ ... " అంటూ సూటిగా అడిగింది !

పీతాంబరం ఆవిడ పోజు చూసి ముందు జంకాడు ! అంతలోనే తయాయించుకొని ..

"సూది...సూది పడిపోయింది. వెతుకు" అన్నాడు !

ఇంతకాలం తన సర్వీసులో 'అయ్యగారు' సూది పారేసుకొని తన కూడా తిరగటం పనిమనిషికి తెలీదు !

అయితే, అంతమాత్రానికే అయ్యగారి శీలాన్ని శంకించడానికి ఆవిడ మనసొప్పలేదు !

'సరే...ఈయన సంగతేదో, సూద్దాం...'

## కార్టూనిస్టులకు సూచనలు!

- ★ కార్టూన్లను మంచి డ్రాయింగు కాగితంమీద ఇండియన్ యింకుతో గీసి పంపాలి
- ★ ప్రతి కార్టూన్ వెనుక కార్టూనిస్టు పేరు, చిరునామా ఉండాలి.
- ★ వ్యంగ్య చిత్రాలు ప్రస్ఫుటంగా సాధ్యమైనంతవరకూ వాటిపై 'వ్యాఖ్య' చదవటానికి ముందే నవ్వించేవిగా అర్థవంతంగా వుండాలి!
- ★ వ్యాఖ్య చిన్నదిగా క్లుప్తంగావుండాలి అక్షరాలు కుదురుగా మొదటిసారి చదివినప్పుడే అర్థం అవ్వాలి! కార్టూన్ మీద పేరూ వూరు అన్నీ రాస్తే అవి తిరస్కరింపబడే అవకాశాలుంటాయి.
- ★ సొంత చిరునామా గల తపాలా బిళ్లలు అంటించిన కవరుగల కార్టూన్లను త్రిప్పిపంపడంజరుగుతుంది దారిలో పోయేవాటికి మా బాధ్యతలేదు.
- ★ ఎన్నుకొన్న కార్టూన్లలో అన్నీగాక కొన్ని మాత్రమే ఒక్కోసారి వేసుకోడం జరుగుతుంది పరిశీలనకి ఐదారువారాలు పట్టవచ్చు.
- ★ పండుగల కార్టూన్లు – బాగా ముందుగా వాటి కవరుమీద ఆ "ప్రత్యేక" సందర్భాన్ని పేర్కొంటూ పంపడం అవసరం.
- ★ రంగుల కార్టూన్లు, పెన్సిలు బొమ్మలు, తెల్లకాగితంమీద వేసిన బొమ్మలు పంపవద్దని మనవి.
- ★ మా కార్యాలయానికి స్వయంగావచ్చి కార్టూన్లు అందజేసేవారు కూడా స్వంత చిరునామాగల స్టాంపులంటించిన కవరు జతచేయాలి. కాపీ కార్టూన్లు పంపరాదు.

– సం॥

## దొంగ?

అనుకున్న తరువాత ... "మీరెళ్లి కూర్చోండి, బాబూ! సూది అవుపిస్తే ... నానొట్టు కొచ్చిస్తాను" అంది...చీపురుకట్టని చక్రంలా గిర్రున తిప్పి!

పీతాంబరానికి తప్పలేదు. పనిమనిషి 'ముండ' తెలివితేటల్ని మనసులోనే తిట్టుకుంటూ తన గదికి వెళ్లిపోయాడు!

భార్య, పనిమనిషి మాట్లాడుకుంటున్నారు...

గదిలో కూర్చున్నా ... వాళ్లమాటలు అతనికి వినిపిస్తున్నాయి.

"అమ్మగోరూ ... అయ్యగారి వొంట్లో బాగానేదేటండీ ... " అని అడిగింది, పనిమనిషి!

"ఏమైందేమిటే!" భార్య!

"అదేటోగానీండీ ... ఎప్పుడూలేంది ... ఇయ్యాల సూది పారేసుకొని...ఎతుక్కుంటున్నారు" అని జాలిపడుతున్నట్లు చెప్పింది, పనిమనిషి!

"సూదీలేదు, దబ్బనం లేదు. డబ్బులు పారేసుకున్నారట!"

"నిజంగా నటండీ ... "

"ఏం నిజమోలే! ఈ మధ్య ఆయనకి మతిమరుపు ఎక్కువైపోతూంది. నిన్నరాత్రి 'బార్'లో టిప్పిచ్చి ... ఇప్పుడు ఇంట్లో వెతుకుతున్నారు" అంటూ, నిట్టూర్చింది భార్య!

పీతాంబరానికి, ఆవిడ్ని నమిలిమింగేయాలన్నంత కోపం వచ్చింది!

కొద్ది క్షణాల క్రితం... ఆ డబ్బు తనే తీశానంది.

ఇప్పుడేమో... తనే బార్‌లో ఎవడికో దానం చేసి... ఇంట్లో వెతుకుతున్నట్లు మాట్లాడుతోంది!

పీతాంబరం... అతికష్టంమ్మీద తన కోపాన్ని దిగమింగుకున్నాడు.

"నిమ్మరసం... నూనీ కలిపి తలకి మర్దనా సేయిత్తే... మతిమరపు తగ్గిపోద్దటమ్మగోరూ..." అంటూ, తన వైద్య విజ్ఞానాన్ని ప్రదర్శించింది, పనిమనిషి!

"బాగా చెప్పావ్..." అంటూ భార్య, దాని తెలివితేటల్ని ప్రశంసించింది.

'వీళ్లని తగలెయ్యా...' అని ఇద్దరినీ జాయింటుగా తిట్టుకున్నాడు, పీతాంబరం.

## ప్రశ్నావళి

ఎన్ని నాదాలు ఒక నాదం?
ఎన్ని శబ్దాలు ఒక కావ్యం?
ఎన్ని గోళాలు ఈ విశ్వం?
ఎన్ని శిలలు ఒక పర్వతం?
ఎన్ని రేణువులు ఎడారి?
ఎన్ని అణువులు బ్రహ్మాండం?

ఎన్ని బిందువులు సింధువు?
ఎన్ని అలలు ఒక పోటు?
ఎంత పోటు ఒక పాటు?

ఎన్ని తరాలు ఒక వంశం?
ఎంత శూన్య మాకాశం?

ఎన్ని ఆవిరులు ఒక మేఘం?
ఎన్ని ఊపిరులు ఒక జీవితం?

— బుడితి రామినాయుడు

'ఏభై రూపాయలు గుట్టుచప్పుడు లేకుండా లాగించేసి... ఇప్పుడు అమాయకంగా డొక్కరు కబుర్లు చెప్తున్నాది. దీని కుప్పిగంతులు నా ముందా! చూస్తాను, దీని అంతేమిటో...' అని తీర్మానించుకున్నాడు.

అలా తీర్మానించుకున్న తరువాత... పనిమనిషిని దోషిగా నిరూపించడానికి అతను అనేక పథకాలు ఆలోచించాడు!

'దాన్ని పిలిచి... డైరెక్టుగా దబాయించొచ్చు...

ఏభై రూపాయల్ని కాజేసినవాళ్లు... తెల్లారేలోగా రక్తం కక్కుకు చస్తారు... మంత్రం వేయించాను–అని బెదిరించవచ్చు...

చూడూ, డబ్బు కాదు నాకు ముఖ్యం. నిజం తెలియాలి. అంతే! నిన్నేం చేయంలే... చెప్పు! నువ్వే తీశావు కదూ అంటూ బెల్లించి నిజాన్ని కక్కించవచ్చు!

ఇవేమీ పనిచేయకపోతే... సింపుల్‌గా పోలీసు రిపోర్టిచ్చిపారేస్తే సరిపోతుంది!

లాకప్‌లో తోసి నాలుగంటిస్తే... దాని తాత దిగొచ్చి నిజం చెప్తాడు.'

అని... ఎన్నోవిధాల ఆలోచనలైతే చేశాడు గాని, దేన్ని అమలుపర్చటమో తేల్చుకోలేక పోయాడు!

ఈ విషయాన్ని ఊరికే వదిలేస్తే... మరో యాభై రూపాయలు పోవచ్చు,

ఫ్రెంచ్ సుగంధం—
మీ ప్రియాతి
ప్రియమైనది.

లవెండర్ డ్యూ
లగ్జరీ సబ్బు మరియు టాల్క్
అసలైన ఫ్రెంచ్ లవెండర్ యొక్క తన్మయం
పొందేలా చేసే సుగంధం.

Lavender dew

ప్రపంచంలోని ఒక అత్యుత్తమమైన సుగంధం—ఫ్రెంచ్ లవెండర్.
ఇప్పుడు శుద్ధము చేయబడి, మేళవించబడినది,
అమోఘమైన లగ్జరీ సబ్బు మరియు టాల్కమ్
పౌడర్‌లో—లవెండర్ డ్యూ.

ఆస్వాదించండి యీ సువాసన, తన్మయం
పొందండి ఫ్రెంచ్ సుగంధంలో.

కార్‌కెమికో వారి ఒక ఉత్పాదన. నాణ్యతకై చూచి వాడేవారికి

HTC-CCC-4400

# ప్రశ్నావళి

—కె. రామలక్ష్మి

**ఎస్. ఎస్.ఎస్ - బాబిన (కాంట్)**

మేము పంపిన రచనలు ప్రచురణార్హం కానివి తిప్పిపంపుతారు కదా! అవి ఎందుకు ప్రచురణార్హత పొందలేదో వ్రాయరెందుకు ?

★ అలా అందరికీ రాస్తూ పంపాలంటే సంపాదక వర్గం—ఇక పత్రిక సమయానికి తేలేరు !

**సురేంద్ర - ఆదోని**

మీ రచనలు చాలా మందిని ప్రభావితం చేసినట్లే మీరు ఎవరి రచనలకైనా ప్రభావితం అయ్యారా ?

★ నేను రచనల వల్ల కంటే వ్యక్తుల వల్ల ఎక్కువ ప్రభావితం అయ్యాను ఉదాహరణకి గోరాశాస్త్రి వంటివారు, రాయడమే ప్రధానంకాదు గౌరవం పోకుండా రాయడం కూడా ముఖ్యం అని చెప్పిన వ్యక్తి గోరాశాస్త్రి. ఇప్పటికీ అదే రూలు పాటిస్తాను నేను నా పిల్లలూ తద్వారా నా కుటుంబం తలదించుకోనవసరం లేని — రచనలే చేస్తాన్నేను నన్ను కన్సర్వేటివ్ అన్నా ఫరవాలేదు రియలిజమ్ లేదన్నా ఫరవాలేదు; ఆశావాదినన్నా ఫరవాలేదు ..తిరోగమనవాదిని మటుకు కాదు నేను అది చాలని నా నమ్మకం

**ఎల్ వి - సాగర్**

మావారు ఇంట్లో అద్దెకిచ్చారు వారూ వీరూ చాలా స్నేహితులైపోయారు కాని ఆవిడ 'వెకిలి' నవ్వు మాటలు నాకు నచ్చవు రాత్రి కాగానే ఇంకో దోస్తు వస్తాడు వాళ్లింటిముందు నాకూ పిల్లలకూ కనిపించకుండా బ్రాందీ తాగుతారు రెండేళ్లగా మాకు పోట్లాట జరుగని రోజులేదు

★ మీరు చెప్పండి 'నేనూ మీతోపాటే వచ్చి ఆమెగారిలాగా మీ పార్టీలో కూర్చుంటాను. పిల్లల్ని చూసుకోండుకు మీ అమ్మగార్ని పిలిపించండి' అని. నషాళాన్నంటిన నిషా కాస్తా దిగిపోతుంది ఇలాంటి విషయాలలో పోట్లాడకూడదు సాధించకూడదు, మనవిజయం తప్పని— ఓ పాఠిక నేర్పాలి అదీ కోపంగాకాదు నేర్పుగా ఏ మగాడికీ, పరాయి మగవాడిముందు తనభార్య యమసోషల్ అని అనిపించుకోడం యిష్టం వుండదు [పరాయి మగవాడి భార్య సంగతి వేరు !]

**జగన్ - ఉరవకొండ**

రాజకీయ నాయకునిపై మీ అభిప్రాయం ఏమిటి ?

★ చాలా ధైర్య సాహసాలే కాదు—గజ చర్మం కూడా కల్గివుండాలి - ఏ అరుణ్‌శౌరీల పాలా పడకుండా బ్రతకాలంటే —

**ఎస్ ఏ - మాలకుప్పం (కర్నాటక)**

అసూయ ముందు పుట్టి ఆడది పుట్టిందట. కామెంట్ ప్లీజ్ ?

★ పొరపాటు. అసూయ ముందు పుట్టింది.- ఆడ మగా తరవాత పుట్టారు.

**ఎం.జె వి పి - పత్తికొండ**

ఆడది ప్రేమకు అర్థం అని నేను, పెళ్లికి నిర్వచనం అని నా స్నేహితులు ఎవరు కరెక్ట్ ?

★ ఏం—ప్రేమకూ పెళ్లికీ సంబంధం లేదా మీ దృష్టిలో ఆడది ఒకే వ్యక్తి అయితే - మీరీ తగువులాటలాడుకోవచ్చు. కాని ఆమె ఒక వ్యవస్థ. తల్లి, కూతురు, కోడలు, చెల్లెలేకాదు ఆమెలో అన్నా, తమ్ముళ్ళు భర్త అందరూ ఇమిడి వున్నారు ఆడది కుటుంబానికి చిహ్నం ఆమెకు ప్రేమా — పెళ్లి ఒకటే.

**జి బి - కొంగరెడ్డిపల్లి**

పంపిన ప్రతికథా తిప్పి వచ్చేస్తోంది చాలా బాధగా వుంది. మీరు పత్రికకు కథ ఎలా పంపిస్తారు ఓ కాగితంపై రాసి పంపగలరా ?

★ గలను కాని నేనేదైనా పత్రికాధిపతుల కోరినప్పుడు రాసినా సరే 'కథమీకు నచ్చని పక్షంలో దయచేసి తిప్పి పంపించేయండి' అని రాసి తీరుతాను అది మర్యాద మన ప్రతీరచనా బాగుండి తీరాలని నచ్చితీరాలనీ రూలులేదు

**వి ఎస్ ఎల్ - పెద్దాపురం**

మంత్రులు మినిస్టర్లు చనిపోతే రేడియోలో భక్తిగీతాలు హోరెత్తి పోతాయెందుకు ?

★ బ్రతికుండగా పుణ్యచింతన చేసే టైము లేనివారు కదా ? చనిపోయాకేనా పుణ్యలోకాలకి దారి చూపాలని !

**జి ఎస్. - కాకినాడ**

నిజం చెప్పండి—మీరు అబద్ధాలు చెప్తారా ?

★ నిజం నేనెన్నడు సత్యంపల్కి ఎరుగనిదాన?

**జి.ఎల్.ఎన్ బరంపురం**

గౌతమ బుద్ధుడు వార్ధక్యాన్ని, చావుని రోగాన్ని చూసి భయపడి మనస్సు చెడి సన్యసించాడు ఆ తరవాత బోధిచెట్టు కింద ధ్యాన నిష్ఠలో వుండగా జ్ఞానోపదేశం కల్గిందని చదివాం కాని ఇప్పటికీ చావు వార్ధక్యం రోగాలూ అలాగేవున్నాయి కదా--గౌతమ బుద్ధునికి జరిగిన జ్ఞానోపదేశం ఏమిటి ? దానివల్ల మనకు కల్గిన లాభం ఏమిటి?

★ ఏమిటి ? ఈ పాఠం గవర్నమెంటు పాఠ్య పుస్తకంలోంచి చదివారా కొంపతీసి !

**వి ఎస్. - కోటాల**

స్త్రీని పూర్తిగా నమ్మినా కష్టమే. నమ్మకపోయినా కష్టమే. ఏమంటారు ?

★ నిజమే. నమ్మి నమ్మక వుంటే కాల్చుకు తినడం సులభం !

**వి ఎస్ వి.ఆర్ - విశాఖపట్నం**

స్నేహం నిలవాలంటే ?

★ ముందు మీరో స్నేహితునిగా ప్రవర్తించాలి.

**పెన్నయ్య - తిరుపతి**

సృష్టిలో మరుపురాని మరువలేని మధురమైనది ఏమిటండీ ?

★ "నేను" !

★

## దొంగ?

పోకపోవచ్చు కానీ యింట్లో నౌకర్లు మాత్రం కచ్చితంగా బరితెగించేస్తారు !

'చిన్నదొంగని పట్టలేని అయ్యగారు, పెద్ద దొంగల్నేం ఎడతాడు ' అని, వాళ్లా అందినవి అందించుకోవచ్చు !

ఇంట్లో రిస్ట్‌వాచీలు, అలారం టైంపీసులు, స్టీలుసామాన్లు, గాద్రెజ్ బీరువాలు అన్నీ కాళ్లొచ్చి నౌకర్ల ఇళ్లకు నడుచుకుపోయినట్లు..

ఇనస్పెక్టర్ మేనేజరు యింటికి ట్రాన్సఫర్ అయి వెళ్లిపోయినట్లు.

అనిపించి,నీరసపడిపోయాడు పీతాంబరం'

అదే సమయంలో

స్మశానంనుండి శవం లేచివచ్చినట్లు ఊడిపడ్డాడు వెంకటేశం.

"వచ్చేశాను, దొరా.." అన్నాడు. నవ్వుతూనే!

"ఎక్కడినుండి వచ్చావ్. ."

వాడు ఆశ్చర్యపోయాడు "అదేటి దొరా! పాలెం ఎల్లమన్నావుగా ! ఎల్లొచ్చాను " అన్నాడు

'పాలెం' మాట వినగానే పీతాంబరం 'షాక్' తిన్నట్లయాడు

"ఓ... ఔను కదూ ." అంటూ గొణిగాడు, తేలు కుట్టిన దొంగలాగా !

"మర్నేను సెలవు పుచ్చుకుంటాను " అని, పీతాంబరం వాడికి సెలవిచ్చేవరకూ ఆగకుండా ... తలగుడ్డను ఒక్క దులుపు దులిపి, భుజాన్న వేసుకుని వెళ్లిపోయాడు, వెంకటేశం !

పీతాంబరం నీరసంగా కూలబడిపోయాడు.

"సూది ఎక్కడా అగుపడ్డేదు, బాబు గోరూ..." అని వచ్చి చెప్పింది, పనిమనిషి !

పీతాంబరం మాట్లాడకపోవడంతో వింతగా చూసి వెళ్లిపోయింది

పనిమనిషి వెళ్లిపోయిన తరువాత చాలా సేపటికి నీరసంగాలేచి ఎక్కౌంట్లువ్రాసుకునే చిన్న డైరీ వంటి పుస్తకాన్ని తీసి .

"పాలెం వెళ్లడానికి ... వెంకటేశానికిచ్చినది—ఏభై రూపాయలు" అని వ్రాసుకున్నాడు, పీతాంబరం

# "సాంప్రదాయ సిద్ధమయిన భారతీయ ఔషధాలకి ప్రత్యేకమయిన శక్తివుంది. ఉదాహరణకి, అమృతాంజన్."

AMRUTANJAN
Pain Balm

ప్రకృతిలో లభించే అత్యంత శక్తివంతమయిన పది మూల ఔషధాలతో అమృతాంజన్ తయారు చేయబడుతోంది. అంటే అమృతాంజన్ చాలా శక్తివంతమయినది.

అందుచేత అమృతాంజన్ తలనొప్పులకు, జలుబులకు, వంటినొప్పులకు, బెణుకులకు శీఘ్రంగానూ, నిశ్చయంగానూ ఉపశమనం కలిగిస్తుంది. అంతేకాదు అమృతాంజన్ సురక్షితమయిన బాధా నివారిణి.

**అమృతాంజన్ :**
80 సంవత్సరాలకు పైబడిన నమ్మకమైన దివ్య ఔషధము

# అమృతాంజన్

## తలనొప్పులకు .జలుబులకు. వంటినొప్పులకు.బెణుకులకు



( గత సంచిక తరువాయి )

























[ఇంకా ఉంది]

# మహాత్మునికి నివాళులు







శ్రీమతి ఇందిరాగాంధి (ప్రధానమంత్రి)



మహాత్మా గాంధీ

ఆంధ్రప్రదేశ్‌లో అక్టోబరు 2వ తేదీని * గాంధీ జయంతి * హరిజన దినోత్సవంగా నిర్వహిస్తూ రాష్ట్రమంతటా హరిజనుల సముద్ధరణకు అనేక సంక్షేమ పథకాలను, అభివృద్ధి కార్యక్రమాలను అమలు జరుపుతున్నారు.



శ్రీ టి. అంజయ్య (ముఖ్యమంత్రి)

"నిరుపేదలు సైతం తమదేశంగా భావించి, దాని నిర్మాణంలో తమకు భాగస్వామ్యం ఉందని భావించే భారతదేశం కోసం ప్రజల్లో తరతమబేధాలకు తావులేని భారతదేశం కోసం అన్ని వర్గాల ప్రజలు స్నేహ సౌహార్ధ్రాలతో జీవించే భారత దేశం కోసం" మహాత్మాగాంధి తమ జీవితాంతం కృషి చేశారు. గాంధిజీ హరిజనుల సముద్ధరణకు ప్రత్యేక శ్రద్ధవహించారు. హరిజనులను దేవుని పిల్లలుగా భావించారు. అంటరాని తనం మన దేశ ప్రతిష్టకు మాయని మచ్చగా ఆయన భావించారు. శ్రీమతి ఇందిరాగాంధి ఆశీస్సులతో ముఖ్యమంత్రి శ్రీ టి. అంజయ్య నాయకత్వంలో రాష్ట్ర ప్రభుత్వం హరిజనులపై జరిగే అత్యాచారాలను అరికట్టే విధంగా పౌరహక్కుల పరిరక్షణ చట్టం నిబంధనలను పటిష్టంగా అమలు జరుపుతున్నది.

అత్యాచారాలకు గురైన వారికి సత్వరంగా న్యాయం చేకూర్చడానికి వీలుగా ఐదు సంచారన్యాయస్థానాలునిర్వహించబడుతున్నాయి. 1981—82 సంవత్సరంలో హరిజన సంక్షేమానికి బడ్జెట్ కేటాయింపులను రు.46.71కోట్లకు పెంచారు. ఈ మొత్తంలో రు.25.75 కోట్లు విద్యాపథకాలకు రు. 8.55 కోట్లు సమాజ సేవా పథకాలకు రు.5.03 కోట్లు ఆర్థికాభివృద్ధి కార్యక్రమాలకు రు.2.65 కోట్లు హరిజనుల ప్రయోజనార్థం, ఇతర సాంఘిక సంక్షేమ పథకాలకు కేటాయించారు. సాంఘిక భద్రతా పథకాల నిమిత్తం రు.4.72కోట్లు మొత్తాన్ని కేటాయించారు. దాదాపు 1.5 లక్షల హరిజన కుటుంబాలను దారిద్ర్య రేఖనుంచి పైకి తీసుకు రావడానికి తోడ్పడే విధంగా ప్రత్యేక అంశాల ప్రణాళిక క్రింద రు. 52 కోట్లు వినియోగిస్తారు. రాష్ట్ర షెడ్యూలు కులాల ఆర్థిక సహాయ కార్పొరేషన్ వారు 1980 అక్టోబరు నుంచి రు. 15.79 కోట్లు పెట్టుబడితో కూడిన ఆర్థిక అభివృద్ధి పథకాల ద్వారా 46.632 మంది షెడ్యూలు కులాల వారికి ప్రయోజనం చేకూర్చారు. ఇటీవల జరిగిన పంచాయితీరాజ ఎన్నికలలో 2,500కు పైగా హరిజనులు సర్పంచులుగా ఎన్నికైనారు. హరిజనులకు అర్చకులుగా శిక్షణ ఇచ్చి ఖాళీలు ఏర్పడిన చోట దేవాలయాలలో వారిని నియమించే పథకాన్ని కూడ రూపొందిస్తున్నారు. ఆంధ్రప్రదేశ్ రాష్ట్రం గాంధిజీకి ప్రీతిపాత్రులైన బడుగు వర్గాల, హరిజనుల సముద్ధరణకు పథకాలను అమలు జరపడం ద్వారా మాటలలో గాక, చేతలలో మహాత్మునికి నివాళులు అర్పిస్తూ.

---

డైరెక్టరు, సమాచార, పౌరసంబంధ శాఖ, ఆంధ్రప్రదేశ్

D.I.P.R No. 45701/Advt/Cl-3/81

## ఇంటర్ చదువు :

పూర్వం 'వివాహో విద్యానాశాయ, సర్వనాశాయ శోభనం' అనే వారు పెద్దలు. కాని ఈ పెద్దల సూక్తిని హైస్కూలులో విద్యానాశాయ సర్వనాశాయ కాలేజి అని మార్చవలసి ఉంటుంది. రాష్ట్రంలో కొన్నివేల ఉన్నత పాఠశాలల మాట అలా ఉండగా, ఆరు వందల జూనియర్ కళాశాలలున్నాయి. వీటిలో ప్రభుత్వం యాజమాన్యంలో ఉండేవి 350. వీటిలో (ఇంటర్మీడియెట్ చదివే) విద్యార్థుల సంఖ్య దాదాపు ఐదు లక్షలు. ప్రభుత్వ జూనియర్ కళాశాలల విద్యార్థుల సంఖ్య దాదాపు మూడు లక్షలు. ప్రభుత్వ జూనియర్ కళాశాలల లెక్చరర్లు రాష్ట్ర వ్యాప్తంగా సమ్మె చేయడం వల్ల ప్రభుత్వ జూనియర్ కళాశాలలన్నీ మూసివేశారు. ఈసారి ఇంటర్ చదువుకు చాలా గండాలు వచ్చాయి. పదో తరగతి పరీక్షా ఫలితాలు దాదాపు రెండు నెలలు ఆలస్యంగా వచ్చాయి. ఇంటర్ తరగతులు మూడు గడువులూ దాటే కుంటుతూ ప్రారంభమయ్యాయి. ఇంటర్లో ఏటా పబ్లిక్ పరీక్షలు ఉంటాయి గనుక పాఠ్యాంశాలు పూర్తి కావు. అవి పూర్తయినా కాకపోయినా పరీక్షలలో ప్రశ్నలుమాత్రం మొత్తం పాఠ్యాంశాల దృష్టితో ప్రశ్నలుంటాయి. పిల్లలు పాఠ్యాంశాలు పూర్తి కాలేదు గనుక వ్రాయలేక పేలవుతారు. ఇంటర్ పరీక్షలు వాయిదా వేయరాదా అంటే వృత్తి తరగతులలో ప్రవేశించే వారికి దెబ్బ. సెప్టెంబర్ 16వ తేదీ నుంచి జరుగుతున్న జూనియర్ లెక్చరర్ల సమ్మె విద్యార్థుల భవిష్యత్తునే దెబ్బ తీస్తున్నది. జూనియర్ లెక్చరర్లలోను ముసలం పుట్టింది. పోటీ సంఘం ఏర్పడడం, పరస్పరం కొట్టుకోడం, ప్రభుత్వం తమలో చీలికలు తెస్తున్నదని లెక్చరర్లు వాపోవడం ఇలా ఇదీ రాజకీయ రణరంగమయింది. ఏది ఏమైనా బలి పశువులవుతున్నారు విద్యార్థులు. ఏ జోలికీపోక జ్ఞానం సంపాదించవలసిన వయస్సులో ఈ పితలాటాలు తలకెక్కి విద్యార్థుల మేధ కుంటితమవుతుంది. దానివల్ల జాతి మేధాసంపత్తికి పెద్ద ఆఘాతం.

# హైదరాబాద్ నోట్‌బుక్

## బీహార్ ముఖ్యమంత్రి పబోధం :

బీహార్ ముఖ్య మంత్రి డాక్టర్ జగన్నాథ మిశ్రా సెప్టెంబర్ 16వ జాతీయ పోలీసు అకాడెమీలో బీహార్ ప్రభుత్వం అతిథి గృహానికి శంకుస్థాపన చేస్తూ, పోలీసులు క్రూర స్వభావం విడనాడి, మానవతా దృక్పథాన్ని అలవరచుకొని ప్రజలలో కలిసి మెలసి పోవాలని ప్రబోధించారు. ఈ సమావేశానికి రాష్ట్ర పోలీస్ డైరెక్టర్ జనరల్ శ్రీ ఎం. వి. నారాయణరావు అధ్యక్షత వహించారు. అతిథి గృహ నిర్మాణం కోసం అయిదు లక్షల రూపాయల చెక్కును పోలీసుల అకాడెమీ డైరెక్టర్‌కు అందజేశారు. శ్రీ నారాయణరావు తమ అధ్యక్షోపన్యాసంలో శాంతి భద్రతలు కాపాడే పోలీసులకు, న్యాయాన్ని కాపాడే న్యాయ స్థానాలకు మధ్య సమన్వయం అవసరమని, జాతీయ సమైక్యం లక్ష్యంగా భారత పోలీసులు ముందంజ వేయాలని అన్నారు. జాతీయ పోలీసు అకాడెమీలో బీహార్ ప్రభుత్వం నిర్మించే అతిథి గృహంలో 30 మందికి వసతి ఉంటుందని, తమిళనాడు, ఉత్తరప్రదేశ్ ప్రభుత్వాలు తమ తమ అతిథి గృహాలు నిర్మించాయని, ఇతర రాష్ట్రాలు గూడ నిర్మించగలవని ఆశిస్తున్నానని శ్రీ నారాయణరావు అన్నారు.

## ఉపాధ్యాయుల ధర్నా :

తమ పరిస్థితిని బాగు చేయాలని కోరుతూ జూనియర్ లెక్చరర్లు ఒక వైపు సమ్మె ప్రారంభింపగా, నగరంలోని మూడు పాఠశాలల్లో దాదాపు ఏణ్ణర్థం నుంచి జీతాలు లేని ఉపాధ్యాయులపట్ల సానుభూతిగా రెండు వందల ప్రైవేటు ఎయిడెడ్ పాఠశాలలకు చెందిన వేయిమంది ఉపాధ్యాయులు సెప్టెంబర్ 16న హైదరాబాద్ జిల్లా విద్యాశాఖాధికారి కార్యాలయం ముందు ధర్నా చేశారు. నగరంలోని సెయింట్ మార్క్స్ స్కూలు తెలుగు పండితుడు శ్రీ విష్ణుమూర్తి, ఎమ్. ఎస్. ఆర్. హైస్కూలు రికార్డు అసిస్టెంటు శ్రీ పి. కె. మూర్తి, వి. వి. కన్యాశాల అటెండర్ శ్రీ శివలాల్ సెప్టెంబర్ నెల ప్రారంభం నుంచి నిరవధిక నిరాహారదీక్ష ప్రారంభించారు. వీరిని ఆయా పాఠశాలల నిర్వాహకులు ఉద్యోగాల నుంచి తొలగించారని, వారిని మరల పనిలో చేర్చుకోవాలని ప్రభుత్వం ఆదేశించినా, ఆ ఆదేశాన్ని పాటించక పోవడంలో అధికారుల జోక్యం కూడా ఉందని ప్రదర్శకులు కోరారు.

## ద్వేషానికి కారణం అజ్ఞానం :

స్థానికరామకృష్ణమఠంఅధిపతి శ్రీ రంగనాథానంద సెప్టెంబర్ 18న సర్వెంట్స్ ఆఫ్ ఇండియా సొసైటీ ఏర్పాటు చేసిన "జాతీయ సమగ్రత" సదస్సును ప్రారంభిస్తూ, వర్గ వైషమ్యానికి కారణం మతాల మూల తత్వాన్ని ప్రజలు అర్థం చేసుకోకపోవడమేనని, నాగరికతలోపించినప్పుడే హింస ప్రబలుతున్నదని, అన్నారు. ఒకదాన్ని చూచి మరొకటి భయపడే అడవి జంతువుల మనస్తత్వాన్ని మానవులు అనుసరించడం శోచనీయమని ఆయన విచారం ప్రకటించారు. ప్రతి మతానికి రెండు సహజ పద్ధతులుంటాయి. ఒకటి దైనందిన జీవితానికి సంబంధించిన నియమ నిబంధనలను విధిస్తుంది. ఇది సంకుచితం, రెండవది ఆధ్యాత్మికమైనది. ఇది విశాల దృక్పథయుతం. ఇవి రెండూ సమాజానికి అవసరమే. ఈ రెండింటిలో మొదటిది ఆధ్యాత్మిక దృక్పథం కన్నా బలమైంది. కనుక హింసాద్వేషాలకు దారి తీస్తుంది. కాని, హిందూ మతంలో ఎల్లప్పుడూ ఆధ్యాత్మిక మూల్యానికే అగ్ర పీటమని, అలా కాక మత విషయక నియమ నిర్బంధాలకే ప్రాముఖ్యం ఉంటే మన దేశంలో బుద్ధుడు, శంకరుడు, గురు నానక్ వంటివారు జీవింప గలిగే వారు కారు అని ఆయన వివరించారు.

## దారుణ హత్య :

రెడ్డి కళాశాల నిర్వాహక సంఘం మాజీ అధ్యక్షులు రాష్ట్ర వ్యవసాయ విశ్వవిద్యాలయం మాజీ వైస్ ఛాన్సలర్ డాక్టర్ రఘోత్తమరెడ్డి మామగారు, ఉస్మానియా విశ్వవిద్యాలయం మాజీ వైస్ ఛాన్సలర్ శ్రీ జగన్మోహనరెడ్డి పెద్ద తండ్రి శ్రీ పింగళి కోదండ రామరెడ్డిని, ఆయన సతీమణి శ్రీమతి పూలాబాయిని సెప్టెంబర్ 20వ తేదీ రాత్రి ఇంటి నౌకరు రామయ్య గొడ్డలితో నరికి దారుణంగా హత్య చేసి లక్ష రూపాయల సొమ్ముతో పోలీసులకు పట్టుబడ్డాడు. శ్రీ కోదండ రామిరెడ్డి వయస్సు 90 ఏళ్ళు. ఆయన సతీమణి వయస్సు 80 ఏళ్ళు. నిందితుడైన రామయ్య పది రోజుల క్రింద బంజారా హిల్స్‌లోని శ్రీ కోదండ రామరెడ్డి ఇంట్లో సేవకుడుగా చేరి ధనాశకు గురై ఈ హత్య చేసినట్లు, పారిపోతుండగా బీటు కానిస్టేబులుకు పట్టుబడినట్లు పోలీసు కమీషనర్ శ్రీ పాప్పయ్య తెలిపారు.



ఉపశ్రుతి:

నాన్న నమస్తే చేయమ్మా తాతగారికి— అని నా దౌహిత్రుడు, ఏణ్ణర్థం బాబు ఉదయనను కోరాను, ఇటీవల మిత్రులు డాక్టర్ రావూరి భరద్వాజను కలుసుకొన్నప్పుడు. ఇప్పటి నుంచి దండం పెట్టే పని ఎందుకు వేధిస్తారు పసికందును? అడ్డమైన వారికీ ముసలాళ దండాలు పెట్టే కాలం ముందు ఉండనే ఉంది. ఇప్పటినుంచే ఎందుకు అతనికీ బాధ — అని చలోక్తి విసిరారు డాక్టర్ రావూరి భరద్వాజ.

— తిరుమల రామచంద్ర.

# ★ వారఫలం ★

**23-10-1981 శుక్రవారం మొదలు 29-10-1981 గురువారం వరకు**

మేషం: —శ్రద్ధతో కార్యసాధన చేసికోవాలి. ముందు వెనుకలు ఆలోచించి వ్యవహారరంగాలలో అనుకూలత సాధించాలి. భారీవ్యాపారంగాని, రచనా వ్యవహారంగాని, పత్రికా ప్రకటనగాని అనుకూలత చేకూర్చగలదు. స్త్రీలకు . ప్రయాణానుకూలత, నగలు, వస్త్రాలు కొనే అవకాశం గలవారం.

వృషభం : నూతన విషయాల తెలిసికోగలరు. పెండ్లి పేరంటాలు సర్వానుకూలత చేకూర్చగలవు. న్యాయంగా కొన్ని వ్యవహారాలలో లాభించదగిన విషయాలతో నష్టం రాగలదు. ఉద్యోగంలో కూడా ప్రగతి సాధించాలంటే అధిక శ్రద్ధ అవసరం. స్త్రీలకు : స్వల్పంగా అన్నిరంగాలలో మేలు చేకూరగలదు.

మిధునం : రచనా విధానంలో మీకు మేలు సమకూరుతుంది. కొన్నినూతననావకాశాలురానున్నవి. గ్రంథ విక్రేతలకు, పత్రికారచయితలకు, రచయితలకు, నటకులకు, న్యాయవాదులకు అనుకూలత గలుగ జేసేవారం. ధనాదాయం గలవారం. స్త్రీలకు కుటుంబానందం, క్రొత్తవస్తువులు కొనుటకు అవకాశం గలవారం.

కర్కాటకం:—బుద్ధి సూక్ష్మతతో, చుట్టు ప్రక్కల వారి సహకారంతో, మిత్రుల సహకారంతో అవకాశాలు లాభదాయకంగా కొన్ని పరిణమించే అవకాశముంటుంది. వ్యాపారంలో అభివృద్ధి సాధించగలవారం. స్త్రీలకు : అన్ని రంగాలలో ఉత్తమ అవకాశాలు, స్వల్పంగా ఆదాయం సమకూరగల వారం. రచయిత్రులకు అవకాశాలుండగలవు.

సింహం.—గ్రహించండి. క్రమంగా ఆదాయం, లభివృద్ధి, యితరుల వలన సహకారం, వృత్తిలో ప్రకాశం సాధింపబడుతుంది. ఆరోగ్యం బాగాచూచుకుంటే మీరు సాధింపరాని కార్యాలు ఉండవు. స్త్రీలకు: రాబడిలో వృద్ధి, రావలసిన ధనం రావటం, రాకనిలచిన అప్పులు వసూలు కావటం గమనిస్తారు.

కన్య:—దైవ కార్యాచరణ, కొందరకు నూతనోద్యోగములు లభించుట, వస్తుసేకరణకు అవకాశం, స్థిరాస్థి పంపకం చేయుటకు, నూతన విషయాలు గ్రహించుటకు, నూతన మిత్రులతో కలిసికొనుటకు, క్రీడావనిలో అనుకూలత సాధించుటకు అనువైన వారం. స్త్రీలకు : సంతానంవల్ల అభివృద్ధి పైయంతస్తుకు పోయేమార్గం సమకూడనున్నది. స్వల్పంగా ఆదాయమున్నది.

తుల.—అధిక వ్యయం క్రమంగా తగ్గే సూచన గలదు. ఒకానొకవిషయం, న్యాయ విచారణ మూలాన పరిష్కారం కానున్నది. ధనలబ్ధికి అవకాశమున్నది. ఉద్యోగంలో శ్రద్ధ వహించుట న్యాయం. స్త్రీలకు : సాహిత్యరంగంలో ప్రకాశత, స్వలా దాయం చెప్పుటకు అనువైన వారం.

వృశ్చికం :—చేపట్టిన కార్యక్రమం, క్రమంగా, శాంతంగా, శ్రద్ధతో సాధించుకోవాలి. అవసరమైతే, రాజీమార్గానే అనుకూలత సాధించాలి. బంధువులలో కొందరు మీ సహాయం అర్థింపనున్నారు వెనుక ముందులాలోచించి కార్యరంగంలో దిగాలి. స్త్రీలక వస్తువాహనాలు కొనే ప్రయత్నం, భూసంపాదన చేయటం, పైయంతస్తుకు పోయే మార్గాన్వేషణ చెప్పదగియున్నది.

ధనుస్సు—ఉత్తరాల మూలాన శుభకార్య ప్రస్తావనలు అందనున్నాయి. నూతన మిత్రులు చేరే అవకాశమున్నది. వ్యాపార లోపంలేక పోవటం, క్రయవిక్రయాలలో అనుకూలత సాధించటం చెప్పదగిన విశేషాంశం. స్త్రీలకు : ఉద్యోగ వృత్తులందు ప్రగతి కనిపించటం, సులభంగా కార్యాచరణ జరగటం గమనిస్తారు.

మకరం—అన్ని విధాలా మేలు చేకూర్చువారం. అన్ని రంగాలలో నిదానం ప్రధానమని గ్రహింపగలుగుతారు. పెద్దల బంధువర్గీయుల, అధికారుల మూలాన విజయం సాధింపనున్నారు. వ్యాపారంలో ఏవో మార్పులు గావింపనున్నారు. స్త్రీలకు : రచన, రాజకీయ,సాహిత్య, క్రీడావనిలో ఆదరణ లభిస్తుంది.

కుంభం:—గమనించండి. భారీ ఎత్తున మీరు గావించే వ్యాపార వ్యవహారం ఫలవంతం, శ్రద్ధతో ధనార్జన గావించటంలో సుముఖత సాధింపగలరు. కుటుంబానందం, వ్యాపారరంగంలో నూతన ప్రయ

## కత్తీ జీవితాలు

జీవితాన్ని
కాలంతో కొలిచి పోస్తుంటే
అన్నీ బాధల మట్టిపెడ్డలు
సమస్యల కంకర్రాళ్ళు
'ఓపిక'తో ఎంత ఏరినా
తరగడంలేదవి —
కాని,
ఏం చేస్తాం ?
లోకం మార్కెట్టులో యిప్పుడు
చాలావరకు యిలాంటి జీవితాలే
దొరుకుతున్నాయి.

— మంత్రవాది మహేశ్వర్

త్వానికి దిగటం గమనించగలరు. స్త్రీలకు : నూతన వ్యవహారాలలో జోక్యం, ఉద్యోగంలో ప్రగతి చెప్ప దగిన ముఖ్యాంశాలు.

మీనం: వారమంతా బాగుంటుంది. ధనార్జనకు, సాహిత్య కళారంగంలో అనుకూలత సాధించుటకు, ఉద్యోగంలో అభివృద్ధి సాధించుటకు, నూతన వస్తువులు కొనుగోలు చేయుటకు, నూతన మిత్రులను కలిసికొనుటకు అనుకూల వారం. స్త్రీలకు :— సుఖశాంతులకు లోపంలేదు. సంతానం అభివృద్ధి నందు చున్నదని, విద్యావకాశాలందు అభివృద్ధి సాధించారని ఆనందింపగల వారం.

– విద్వాన్ కోట సత్యరంగయ్య శాస్త్రి

# ఫాలాక్షుని డైరీ

## అమెరికన్ నటుడి ఆగ్రహం!

అమెరికన్ నటుడు యాన్ కానెల్ న్యూయార్క్ పియరీ హోటల్‌లో బసచేసి వుండగా ఆయన అభిమానులు కొన్ని వేలమంది నేల ఈనినట్లు వచ్చి విరుచుకుపడ్డారట. ఇది ఎదురు చూసి తాను పెట్టుకున్న పోలీసు సెక్యూరిటీ ఆఫీసరు బ్రెన్నన్ క్యాంప్‌బెల్ ఆ ప్రవాహాన్ని అరికట్టలేకపోయే సరికి యాన్ కానెల్‌కు కోపం వచ్చి తాను త్రాగుడుకు సిద్ధంగా పెట్టుకున్న బాటిలు వూచి పట్టుకుని విసిరాడట క్యాంప్‌బెల్ మీద. దీనికి కోర్టులో సంజాయిషీ ఇస్తూ తనకు పిచ్చి కోపం వచ్చిందని చెప్పి చూశాడు. ఇంతకీ ఆ క్యాంప్‌బెల్ ఆ నటుడి మీద ఒక మిలియను పౌనులకు దావా వేశాడట.

### హత్యా! ఆత్మహత్యా ??

మద్రాసు క్రిస్టియన్ కాలేజి పాయఖానాలో రఘు అనే ఒకతని శరీరం సీటి గొట్టానికి వో తాడు ద్వారా వ్రేలాడుతోందట మొన్న ఆగస్టు 17వ తేదీన. రఘు తన 14వ ఏట గుడ్డివాడై 16వ ఏట కుడి కాలు ఏదో వాతం వంటిది వచ్చి పడిపోయిందట. అతను బియ్యే ఫిలాసఫీ ప్యాసయ్యి ఎమ్మే సీటు కోసం ఆ కాలేజీకి వెళ్లాడట. ఫిలాసఫీ హెడ్ ఆఫ్ ది డిపార్టుమెంటు డాక్టర్ శ్రీనివాసరావతన్ని చూసి, "ఇన్ని అవకరాలతో ఇంకా చదువెందుకు? ఎలా చదువుతావు, హాయిగా ఉద్యోగం చూసుకో. నీకు సీటు ఇవ్వడం అసాధ్యం" అన్నారట. ఆనక చాలామంది ప్రొఫెసర్లు రఘు తెలివితేటలు అపారమనీ, అతన్ని అలా అనరాదనీ, సీటివ్వాలనీ, శ్రీనివాసరావుగారిని ఒప్పించారట. అసలు విషయం రఘుకి తెలిసేలోగానే అతని జీవితమే సమాప్తమయిపోయిందని, తన కొడుకు ఆత్మహత్య చేసుకునే అవసరంలేదని, అతను చాలా మనోధైర్యం కలవాడని అతని తండ్రి అన్నాడట.

### అతనికంటె ఘనుడు!

అస్సాం ప్రభుత్వానికి చెందిన ఒక డిపార్టుమెంటు డైరెక్టరు గారి కూతురు వివాహానికి అదే డిపార్టుమెంటు జాయింట్ డైరెక్టరుగారో బహుమతి తీసుకెళ్లి సమర్పించుకున్నారట. ఆనక వోనాడు ఆఫీసు గొడవల్లో వీరిద్దరికీ ఏదో పేచీ వచ్చేసరికి డైరెక్టరుగారు తన ప్యూను ద్వారా జాయింటు డైరెక్టరుగారు తన కూతురు పెళ్లికి ఇచ్చిన బహుమతిని తిప్పి పంపేశారట కోపంతో. తిరిగివచ్చిన బహుమతిని చూచి పిచ్చి కోపం వచ్చిన జాయింటుగారు ఆనాటి పెళ్లిలో తాను తిన్న అన్నానికి బిల్లు ఎంతయిందో చెప్పి తనవద్ద తీసుకొంటే ఆ బహుమతి తాను తీసుకుంటాననీ లేకపోతే ఆ డైరెక్టరుగారు తన ఇంటికి భోజనానికి వస్తే సరికి సరి అవుతుందనీ ఆ ప్యూను చేత కబురెట్టారట — మహబావుంది.

# టాప్ స్టార్ ఉన్న కప్పు ఏది ?



## చూడండి, ఇక్కడ చిక్కని, కమ్మని టీ ఉన్నది

### చూడగానే తెలుసుకుంటారు దాని గొప్పదనం
### రుచిచూడగానే గ్రహిస్తారు దాని కమ్మదనం

చిక్కదనపు పరీక్ష...చేసి చూడండి...టాప్‌స్టార్ అన్నిటికన్నా మెరుగు...మరే ఇతర టీకన్నా చిక్కనిది — చిక్కదనంలో టాప్, కమ్మదనంలో టాప్.

ఎందుకంటే, ప్రత్యేకమైన భారతీయ తేయాకుల తాలూకు ఘాటైన (స్ట్రాంగ్) సమ్మేళనం నుంచి తయారైంది లిప్టన్ టాప్‌స్టార్... సంతృప్తి నిచ్చే చిక్కని, కమ్మని టీ కోరుకునే వారి కోసం!




# లిప్టన్ టాప్ స్టార్ టీ

**చిక్కదనంలో టాప్, కమ్మదనంలో టాప్**

LIPTON

LIN... S, 6-2315 TL.

# అవీ...ఇవీ...అన్నీ

## హాస్య ఏకాంకికల పోటీ

నవ్యనాటక సమితి [హైదరాబాదు] వారు హాస్య భరితమయిన ఏకాంకిక పోటీలను నిర్వహించ నున్నట్లు సంస్థ ప్రధాన కార్యదర్శి వ్రాస్తున్నారు. సుమారు 45 నిముషాల ప్రదర్శనకు అనుకూలంగా రచనలు ఉండాలి. ఎంట్రీలకు గడువు తేది 31.10 81. వివరాలకు నవ్యనాటక సమితి, 1-8. 522/12, చిక్కడపల్లి, హైదరాబాద్—20కి వ్రాయాలి

## గోడమీద బొమ్మ

ఆంధ్రప్రదేశ్ బాలల అకాడమీ ప్రచురించిన పొడుపు కథలు. సంకలనకర్త శ్రీ వెలగా వెంకటప్పయ్య, సమీక్షకులు శ్రీమతి డా. యశోదా రెడ్డి. 56 పేజీలు వెల రు. 3 లు. ప్రతులకు: ఆంధ్రప్రదేశ్ బాలల అకాడమీ, 34/4 ఆర్ టి బర్కత్‌పురా క్వార్టర్స్, హైదరాబాద్-500027

## ఇందిరా ప్రియదర్శిని

ఆంధ్రప్రదేశ్ బాలల అకాడమీ ప్రచురణ. రచన బాలబంధు శ్రీమతి ఇల్లిందల సరస్వతీదేవి, 92 పేజీలు. వెల రు. 6 లు. ప్రతులకు ఆంధ్ర ప్రదేశ్ బాలల అకాడమీ. 34/4 ఆర్. టి బర్కత్‌పురా క్వార్టర్స్, హైదరాబాదు—500027

## వెలుగుబాటలు

ఆంధ్రప్రదేశ్ బాలల అకాడమీ ప్రచురించిన మహా పురుషుల జీవిత చరిత్రలు. సంకలనకర్త శ్రీ శివరావు. సమీక్షకులు శ్రీ రావూరు వెంకటసత్య నారాయణరావు, చిత్రకారులు శ్రీ గోలి శివరావ్ 76 పేజీలు వెల రు. 3 లు. ప్రతులకు ఆంధ్ర ప్రదేశ్ బాలల అకాడమీ 34/4 ఆర్. టి. బర్కత్ పురా క్వార్టర్సు, హైదరాబాద్—500 027.

## అనగా అనగా

ఆంధ్రప్రదేశ్ బాలల అకాడమీ ప్రచురించిన కథల సంకలనం. సంకలన కర్త శ్రీ మండా సూర్య నారాయణ. సమీక్షకులు శ్రీ ఇరివెంటి కృష్ణ మూర్తి. చిత్రాలు శ్రీ అమల్‌మోహన్. 98 పేజీలు. వెల రు. 3 లు. ప్రతులకు ఆంధ్రప్రదేశ్ బాలల అకాడమీ, 34/4 ఆర్.టి. బర్కత్‌పురా క్వార్టర్స్, హైదరాబాద్ 500 027.

## చిరుగజ్జెలు

ఆంధ్రప్రదేశ్ బాలల అకాడమీ ప్రచురించిన నృత్య నాటికలు. సంకలనకర్త శ్రీ ఏడిద కామేశ్వరరావు. సమీక్షకులు శ్రీ నటరాజ రామ కృష్ణ. చిత్రాలు శ్రీ గోలి శివరావ్. 14 పేజీలు. వెల రు. 5 లు. ప్రతులకు ఆంధ్రప్రదేశ్ బాలల అకాడమీ 34/4 ఆర్ టి, బర్కత్‌పురా క్వార్టర్స్ హైదరాబాదు—500 027.

Printed and Published by S. Nageswara Rao at the Andhra Patrika Press, Mallikarjuna Rao Street
[illegible] Editor : S. Radhakrishna

# స్వయంగా మీకు చాలినంత లభిస్తున్నదని నమ్మకంగా మీరు చెప్పుకోగలరా?






చాలా మంది తల్లులు తమ తమ ఆహార పదార్థాలలో ఆరోగ్యానికి ఏది మంచిదో అది చాలినంత లభిస్తుందో లేదో స్పష్టంగా చెప్పలేరు.

అందుచేతనే వారు హార్లిక్స్‌ను నమ్ముకున్నారు

హార్లిక్స్ రోజూ క్రమం తప్పకుండా తీసుకున్నట్టయితే మీ కుటుంబానికి పుష్టికరమైన సంపూర్ణ ఆరోగ్యం చేకూరుతుంది.

ఎందుచేతనంటే, చిక్కటి పాలు, మాల్టెడ్ బార్లీ గోధుమ పుష్కలంగా హార్లిక్స్‌లో ఉన్నాయి. అవే ప్రధాన పోషకాహారానికి మూలం

హార్లిక్స్‌ను నిత్యం తీసుకోవటం ఎంతో మంచిది. మీ మనసులోని అన్ని చింతలనూ తొలగిస్తుంది.



'మా డాక్టరుగారు హార్లిక్స్‌ను సిఫారసు చేసినప్పటినుంచి మా కుటుంబమంతా రోజూ హార్లిక్స్ తీసుకునేట్టు అలవాటు చేశాను.

మీరు కూడా మీ కుటుంబానికి హార్లిక్స్ ఇస్తున్నారా?"

# హార్లిక్స్-మంచి పుష్టికరమైనది

HTD-HMM-7042